# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

జూలై 1958

సంపుటము ౩౫ : : సంచిక 7

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూలై 1958

# దీపాంగన

శ్రీ దాశరథి

దీపశిఖ పిల్చినది పురంధ్రీ లలాట
పట్టి దీర్చిన కుంకుమ బొట్టు వోలె,
దీప శిఖ పిల్చినది, చనుదెంచినాను
తనువు తనువెల్ల ఆజ్యపాత్రమ్మువోలె

ఎరకలు వచ్చె నా యెడద కిప్పుడు, దీపకుమారికా భుజాం
బరమున తేలియాడెదను పాడెద, మంచులు పేరినట్టి ఈ
ధరణి జడత్వమూడ్చుటకు తాపము పెంచెద, వేడిలేని ఈ
పరిసరముల్ కవోష్ణరసవారిధిలో నెసలాడజేసెదన్

నాకున్ దీపశిఖాకుమారికకు ఈ నాడా! శతాబ్దాల ముం
దే కానుండెను పెండ్లి! కాని పవనద్వేషమ్ము దీపానకున్
నాకున్ మధ్య నఘాతముల్ నిలిపె, నైనన్ దాని చేలాంచలం
బాకంపించె మదీయ శీర్షమున ప్రేమామోద సంవాహమై

శలభమ నైన నన్ శరభ సామజ సింహ బలంబులిచ్చి ది
వ్వెల దొరసాని పెంచినది, ప్రేముడితో ముడివేసి వాన గా
డ్పుల తొలిదాడినాడు నను బ్రోచిన, దెంతటి రాగబంధమో!
చలి యన లేదు దీపక భుజా భుజగీ పరిరంభణమ్మునన్

బందీయయ్యె జగమ్ము దీపకళికా ప్రత్యగ్ర బాహా యుగం
బందున్ నా యెదవోలె, అంధ తమస వ్యాధూత కోకారి వ
చ్చిందా బంధుర లోకమున్ విడచి మద్దీపాంగనా లింగ నా
నంద స్యందన మెక్కి రివ్వుమని పోనా స్వర్గమార్గమ్ములన్!

ప్రతి యింట నొక చిన్ని ప్రమిద వెల్గించిన
        అవిరళస్నేహ రాజ్యాధిరాజ్ఞి,
ప్రతిగుండె నొక ప్రభాప్రతిమ నిర్మించిన
        కల్పనా నల్ప శృంగార ధాత్రి
ప్రతి తోటలో నవప్రసవమై విచ్చిన
        కాంతార కాంత వాసంత లక్ష్మి.
ప్రతి మానవీ ముఖాంబరమందు ప్రాకిన
        గోరోచనా చంద్ర చారు మూర్తి.

దీపభామిని, ఆశాదీప్త కీర్తి,
మంచు కరగించి, వేదికల్పించి, వాగ్వి
పంచి సవరించి వాయించి ప్రకృతి నెల్ల
మూర్ఛ తేరిచి చేతనాంబుధిని దేల్చెః

కాలిన రెక్కలన్ పులుగుకై పడి నీపద కంజ సన్నిధిన్
ప్రాలితి, నిన్ను మ్రింగుటకు వచ్చిన గాడుపు దుండగీనితో
ఆలముసేసి గెల్చుగొనునప్పుడు రెక్కలు కాలిపోయె నీ
జ్వాలలు సోకి; నీకొరకు ప్రాణములైన పణమ్ము పెట్టెదన్

నీలో తేజము తగ్గిపోవునెడ నందింతున్ కవోష్ణాస్రమున్
తైలంబట్టుల—అశ్రుధారలను సంతప్తాజ్యధారం బలెన్,
జ్వాలా చేల విలోల పావక వపుర్వల్లీ విలాసంబుతో
భూలోకంబును పొంత మొక్క త్రుటి సమ్మోహింపగా జేతువేః

        నన్ను స్నేహము చేసికొన్నావు నీవు
        వెల్గుచున్నావు నాకునః నీతి పైన
        ప్రతి రుధిర బిందువును సమర్పణ మొనర్చి
        నిన్ను వెల్గించుటకు మరణింతు నేనుః

## దీపాంగన

ఏ కేళీ పరిచుంబితంబయిన నా స్నిగ్ధా ధరోష్ఠమ్ముపై
ప్రాకేళీ కమ్మదనాలు ద్రాక్షరసమై, ప్రత్యగ్ర మాధ్వీకమై;
లోకాతీత సుఖమ్ము కూర్చినవి నీ రోచిష్ణు బాహాయుగ
ప్రాకారాంతర జృంభమాణ లికుచాభస్వర్ణ వక్షోజముల్

వెలుతురు మొగ్గవై బ్రతుకు వీథుల నూత్న పరీమళమ్ములన్
జిలికిన నీకుగాను విరచించితి గుండియ కొండమీద ది
వ్వెల రతనాలమేడ, పదవే అటనుందువుగాని, కోటి గుం
డెల వెలిగింప గల్గు రమణీన్ నిను గాదుపు పాలొనర్తునే

నీ నృతి జూచి లోకము ఖణిల్లను గజ్జెలతో నటింపగా
బూనెను, జారిపోయినది పో భవదంసగతాంబరాంచల
శ్రేణి, కటీరపటంబు శిధిలీ కృతమయ్యె, వివస్త్రవై శివే
రాణి! రవీంద్రకల్పిత విలాసిని ఊర్వశివోలె, దీపికా!

నిను కౌగింటను గొన్న నా తనువు పోనేపోవుగానీ భవత్
తను తేజః పరిణాహ పింజరితమీ ధాత్రీతలంబెల్ల ఆ
త్మనుగా జేసి వసింతు సప్తజగతీ మధ్యమ్మునన్ దీప భా
మిని ప్రేమించిన దీప్తిమంతుడనుగా మిన్నెక్కి క్రీడించుచున్

# హరవిలాసము: కుమారగిరి

## శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుఁడు తన కృతులలో నేదియో యొక రీతిని ప్రశస్తిని గల్పించుకొని రెడ్డిరాజుల ప్రాభవము బ్రశంసించుచు వచ్చినాఁడు. ఏ ప్రబంధమునందే విషయమును బరించినను నది చారిత్రిక ప్రమాణము చే బలపడునదియే యగుట సమకాలిక కవిరచనములు వాని కుపోద్బలకములై వెలయుచుండును. హరవిలాస కృతికర్త కాంచీపుర వాసియైన యవచితిప్పయసెట్టి అతఁడు శ్రీనాథునకు బాల్యసఖుఁడు కొండవీటి రెడ్డి రాజులతో వాణిజ్య సంబంధ మేర్పఱచుకొని, వైభవ ప్రాభవముల వాసించి వన్నెకెక్కినవాఁడు కావున నీ కొండవీటిలో పెదకోమటి వేముని సామ్రాజ్య మంతరించిన తరువాత, శ్రీనాథునకుఁ గృతికర్తగా, శివ భక్తుఁడు, కుమారగిర్యధీశలబ్ధ రాజలాంఛనుఁడు, మహా విభవ సంపన్నుఁడు నగు అవచి తిప్పయ్యసెట్టి గాన వచ్చినాఁడు ఈవిషయమును శ్రీనాథుఁడు హరవిలాసమున కృత్యాదియం దిట్లు తెలిపియున్నాఁడు

వ "శ్రీమత్పురాంతక దేవ దివ్య శ్రీపాద పద్మారాధకుండును, వశీకృత నిఖిల భూభుజుండును, సతత త్యాగ ధ్వజుండును, వినిర్మల కులశీలుండును, గవి జన స్తోత్రపాత్రుండు ననంబరగి, జంబూ ద్వీప భూభువనమండలీ మకుట మండనాయమానంబగు కొండవీడుపురంబు రాజధానిగాఁ గీర్తిలతాధిష్ఠితాస్థాని ద్వీపాంతరం బుంచెడు కొమరగిరి వసంత నృపాలునివలన నాందోళికా ఛత్ర చామర తురంగ భద్రపీఠాది రాజ్యచిహ్నములు వడసి, యమ్మహారాజునకుఁ బ్రతివత్సరంబును వసంతోత్సవంబులకుం దగిన కస్తూరీ కుంకుమ ఘనసార పంకమున హిమాంబు కాలాగురు గంధసార ప్రధానంబులగు సుగంధ ద్రవ్యంబు లొసఁగూర్చియు, జీని సింహళ తవాయి హురుమంజి జోణంగి ప్రభృతి నానా ద్వీప నగరాకరంబులకు ధనకనక వస్తువాహన మాణిక్య గాణిక్యంబులు తెప్పించియుఁ, గవి గమకి వాది వాగ్మి వైతాళికాదులకు నర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు, ధీరుండన నుదారుండన గంభీరుండన సదాచారుండన భువన విఖ్యాతి గైకొను నవచితిప్ప ప్రభుండు"

ఈ వర్ణనమున మనకెన్నియో విషయములు విదితములగుచున్నవి అవచి తిప్పయ యఖండ శివభక్తుఁడు ఉదారుఁడు కవిజన కల్పకము ననునది మొదటి విషయము ఆ వెనుక కొండవీటి పాలకుఁడైన వసంతరాజ బిరుదాంకితుఁడగు కుమారగిరివలన రాజచిహ్నములు వడసిన మేటి కోమటియని తెలియవచ్చుచున్నది. కుమారగిరి ప్రతివత్సరము వసంతోత్సవములను జేయుచుండెడి వాఁడనియు, ఆ యుత్సవములకు వలయు కస్తూరీ కర్పూర గంధసారాది సుగంధ ద్రవ్యములను ద్వీపాంతరములనుండి రావించి, యొసఁగూర్చుచుండెడి వాఁడనియు, తన్మూలకముగ కుమారగిరితో నవచి తిప్పయకు వ్యాపారిక సంబంధము ఘనిష్ఠమయ్యెననియు, ఆ నాఁటి యాంధ్రుల నౌకా వ్యాపారము చీని సింహళాది ద్వీపాంతరములతోఁ గొనసాగుచుండెననియు విదితమగుచున్నది. అవచి తిప్పయ కవిప్రియుఁడనియు నర్థిజనుల కర్థముల గుప్పించువాఁడనియుఁ దెలియుచున్నది.

అవచితిప్పయసెట్టి కుమారగిరి కెట్టి ప్రతి సంవత్సర వసంతోత్సవముల కే యే ద్వీపములనుండి యే యే సుగంధ ద్రవ్యములను గొనివచ్చుచుండెడి వాఁడో, ఆ నాఁడే యే యోడలు నౌకా వ్యాపారమునందు పయోగపడుచుండెడివో వాని నీ కృత్యాదియందే శ్రీనాథుఁడు తెలిపియున్నాఁడు

సీ. పంజారఁ గర్పూర పాదపంబులఁ దెచ్చె
      జలనొంగి బంగారు మొలకఁ దెచ్చె
సింహళంబున గజసింధురంబులఁ దెచ్చె
      హురుమంజి బలుతేజి హరులఁ దెచ్చె
గోవ సంశుద్ధ గంధ మద ద్రవము దెచ్చె
      యాంపఁ గట్టాణి ముత్యాలు దెచ్చె
పోటఁ గస్తూరికా పుట కోశములు దెచ్చెఁ
      జీనిఁ జీనాంబర శ్రేణిఁ దెచ్చె

జగద గోపాల రాయ వేశ్యా భుజంగ
బల్లహాదిత్య ఘూర్జర పరశురామ
కొమరగిరి రాజదేవేంద్రు కూర్మిహితుఁడు
వాణి జెగసెట్టి దేవయ చామిసెట్టి

హర. 1-26

మ. తరుణా చీనితవాయి గోవ రమణా
స్థానంబులం జందనా
గరు కర్పూర హిమాంబు కుంకుమ రజః
కస్తూరికా ద్రవ్యముల్
శరధిం గప్పలి దోఁచు వల్లభలికా
సమ్మాన్యలఁ దెప్పించు నీ
శ్వరి రౌప్య దైన్య కులో స్త్రీయుం పెనచి తి
ప్పం డల్పుఁడే యిమ్మహిన్

హర 1-28

దీనింబట్టి అవచి తిప్పయసెట్టి తన పోవకల తోడ్పాటుతో ద్వీపాంతరముల నుండి బహు మూల్య వస్తువులను దెప్పించి, వానిని గొంపెట్ల నిలువఁజేసి, కుమారగిర్యధీశ్వరునకుఁ గూర్మిహితుఁడై మన్నికెక్కి యుండెనని తెలియుచున్నది అవచి తిప్పయ వంశము వారి వ్యాపారిక సంబంధమీ కొమరగిరి నాఁటిదే గాక తత్పూర్వమునందు అవచిసెట్టి, కుమారగిరి రెడ్డి తాత యగు ప్రోలయ వేమని నాఁటినుండియుఁ గలదని యీక్రింది పద్యము తెలుపుచున్నది

క. శ్రీ పర్వత సోపాన
స్థాపకుఁడగు రెడ్డివేమ జగతీపతికిన్
ప్రాపైన యవచి దేవణి
యాపావనికి జనించె నభ్యుదయముతోన్

హర 1-18

ప్రోలయ వేమని ప్రశస్తికి నిదానము శ్రీశైలమునుండి కృష్ణానదికి సోపానములు గట్టించుట. రెడ్డిరాజుల వెలకొల్పిన శాసనములలో ప్రోలయ వేమని పాతాళగంగకు సోపానములు నిర్మింపఁజేయుట ప్రధానముగ నిరూపింపఁబడినది. తన్నిదర్శకమైన యీ క్రింది శ్లోకము పెక్కు శాసనములలోఁ గానవచ్చుచున్నది.

శ్లో. సోపానాని కృతాని యేన కృతినా
పాతాళగంగాతటే
శ్రీశైలస్య మహీశమౌళిమణినా
శాన్త్యైక చిత్రంపునః
సోపానాని భవన్తి
మేరుశిఖరారోహాయ నాకౌకసాం
నాహేయ త్రిదశాంగనా జన
మహాసౌధాధిరోహాయ చ ।

శ్రీశైలవాసి మల్లికార్జునదేవుని సాన్నిధ్యమునఁ బ్రవహించు కృష్ణానదికి పాతాళగంగ యని పేరు. శ్రీశైలమునుండి పాతాళగంగా ప్రవాహమువఱకు ప్రోలయ వేమఁడు సోపానములు నిర్మింపఁజేయఁగా, తద్ద్వారమునఁ బాతాళగంగలో స్నానముచేయువారికి ఆ సోపానములే స్వర్గారోహణమునకు సోపానము లగుచున్నవని యీ శ్లోకభావము. ఈ వేమని ప్రధానాపదానమును శ్రీనాథుఁడు పొగడించినాఁడు. మఱియు నీపద్యమునందే యవచిసెట్టి ప్రోలయ వేమనికి ప్రాపుగ నుండెనని తెలియవచ్చుచున్నది. అవచి తిప్పయ వంశమువారు సముద్ర నౌకావ్యాపారమున ప్రఖ్యాతినడసి, విశేషధనమార్జించినవారు. ఆనాఁడు ఆంధ్రదేశమునందలి ఓడరేవులలో ముకుళిపురము (మోటుపల్లి — గుంటూరుజిల్లా బాపట్లకు సమీపమున నున్నది.) ప్రసిద్ధమైనది. దానిమీఁద నధికారము సన్నిహితులైన రెడ్డిరాజుల కేర్పడియుండినది. ప్రోలయ వేమఁడు తన తమ్ముఁడైన మల్లారెడ్డిచే ముకుళిపురమును వశము చేసికొనెననియు, తన్మూలమున కొంత యాదాయము లభించుచుండెడిదనియు వారి వంశములోని యీ క్రిందిపద్యము తార్కాణించుచున్నది

ఉ. బాహాదర్పమునం బ్రతీప ధరణీ
పాలాళిం ద్రోలి యు
త్సాహోదగ్రుఁడు మోటుపల్లిఁగొని స
ప్తద్వీప సద్వస్తు సం
దోహంబుం దనకిచ్చు నొచ్చెలి సము
ద్రం బ్రీతిఁ గావించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీ
నాథుండు గాఢోద్ధతిన్.

—హరి [illegible]

దీనింబట్టి ప్రోలయ వేమనినాఁడు మోటుపల్లి నుండి ద్వీపాంతర వ్యాపారము సాగుచుండెననియు, తదధికారము అద్దంకి ప్రభువుల వశముందుండెననియు, దెలియవచ్చుచున్నది. ప్రోలయ వేమని తరువాత

1. చూ. రెడ్డిసంచిక - అనుపర్తి శాసనము.

# కరుణాలహరి

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

దేవ! విషాదభూమి బహుతీవ్ర విషానల మూలమౌర నా
నా విషయ వ్యథోగ్ర తిమి నక్ర ఝషాకుల మీ భవాబ్ధిలో
నావ యొకింత గన్పడ కనారతముం బడి కొట్టుకొందు దుః
ఖావధి గాన నీ కిదె మదాత్మ సమర్పణ మందుకొంగదే

భవభయదాగ్ని కీలలకుఁ బ్రాణము తావులు దప్పె, భీతిచే
భవ దరుణాంఘ్రి పంకజము పాయక దిక్కని పట్టుకొంటి నే
నవిరతమున్, దయారస సుధాబ్ధివి గావున పథ్యమేది యే
దవునను కొందునో యది దయన్ ఘటియింపవె నాకు శ్రీపతీ!

అరయన నేక దేహముల నల్లిక వెట్టి మరీచి కావళిన్
దొరయు మహా మరుస్థలిగఁ దోచు ప్రపంచ మెఱింగి వీడి తో
మురహర! నీ దయామృత సముద్రములోఁ బడి యోలలాడఁగా
దొరకొని నామనో మృగము దూకుచు నూరక చెంగలించెన్

నీ పదపుల్లపంకజ వినిర్మల దివ్యమరంద పాన లీ
లా పరతంత్రతన్ బరమలంపటమైన మనోమిళింద మో
శ్రీ పరమేశ! చాపల మశేషమునున్ విడనాడి, నిన్ వినా
యే పరదైవమేని నిరసించి దృణంబని యెంచుఁ గాంచితే.

ఏనరు లీ జగత్త్రియము నెల్లవిధమ్ముల నేలఁ గంకణ
మ్మూనిన నిన్ను, నీచరణ యుగ్మముఁ గాదని త్రోసివైచి, యే
కోనరొ వేరుదిక్కు గనుగో వెదుకం జనువారో, వార లీ
శాన! కృతాంత దుర్గమ నిశాంత కవాటము తట్టరే హరీ!

లలిత రమా ముఖాంబుజ విలాస వికాసన పూర్ణ దక్షతన్
బొలిచి జగత్త్రయీ జన విబోధ విధాన నిదాన దీక్షమై
నలమి త్వదీయ దివ్యనయనారుణ రేఖలు వాలువారి తా
మెలమి హరించుచున్నఁడొ కదే మదబోధ విభావరిన్ హరీ!

నిరతి సురాసుర ప్రకర నిస్తుల చిత్త చకోర చుంబిత
స్మేరయ సమస్తసాధు జనతాఖిల తాపచయాపనోద నా
దరముగు నీ ముఖమ్మను సుధానిధిఁ జాల్కొను పండువెన్నెలల్
విరిసి మదీయ మానస మలీమస దుర్నిశిఁ దోచు టెన్నఁడో.

నిండగు యౌవనమ్మున వినిర్మల పాండుర గండమండలిన్
మండిత చండ దీధితి కనన్మణి కుండల తాండవమ్ములన్
బండువు సేయు నీ వదన పంకజ మచ్యుత! ముద్దుగుల్కు మా
దండను దోచి కందొవకుఁ దానొక విందగు టెన్నఁడో ప్రభూ!

గంగా తుంగ తరంగ భంగిమను జక్కన్ దూగి దేవాసురా
భంగ శ్రీక లలాట లాలితమునై త్వత్పాద పంకేరుహా
సంగమ్మైన పరాగపుంజమది యాశా! యుత్తమాంగాన నే
సింగారించు టదెప్పుడో కద దయాసింధూ! జగద్బాంధవా

దేవ! మదింద్రియాశ్వములు త్రెంచుకొనెన్ మదమేచి, త్రెంచి పా
శావళి నా వివేకమను సట్టి దయా! యురికెన్ జవమ్మునన్,
దావక పాద మందురనుఁ దారిచి త్వద్గుణబంధనమ్మునం
దీవ బిగింపు తండ్రి! వహియించు నొకించుక సాధుభావమున్

పతినై సర్వపురాణ వాగ్వితతికిం బట్టంగ రానట్టి స
ద్గతి యా శ్రీ పురుషోత్తమున్ విడిచి నిన్ గల్యాణమూర్తిన్ మహా
పతియా నామది సిగ్గువీడి పరమేశా! యింక నెవ్వారి సం
గతి నాసించును దెల్పవే పరమ మాంగళ్యాకృతీ! శ్రీపతీ!

నీదు కృపాలవం బదియ నేను వరించితి, నంత మీఁద నిం
కేదియు స్వప్న జాగృతుల నెన్నఁడు గోరన లేదు నిక్కు, మీ
నాదు నివేదన మ్మొగి మనమ్మునఁ దార్ఢ్యకమంచుఁ దట్టినా
వేద విధేయ! కాదనక వేగము నన్ను బరిగ్రహింపుమా!

ఆపదను నన్న హా! విడిచి రందరు చూచితె యిప్పుడో దయా
వనధి! యొకింత నాదు దురవస్థ గనుంగొనరాదె, యింక నై
నను నను జెట్టవట్టి యొకనాడయినన్ మదివేగ లేవ? నే
డిక విడరాదు, రా కటికి డెందము కాఁడ విభ్రాంతి వేలరా?

# కరుణాలహరి

అతి భరమైన యీ జగము నంతయుఁ బూనెదు, జీవకోటి బల్
ధృతి భరియింతు, నీకు బరు వింతకు శోచన లేద, జీవ సం
తతిఁ బరమాణువైన నను దండ్రి! భరింపఁగ భారమానె? నా
గతి యెవరింక నార్త జన కల్పక! నీవ యుపేక్ష సేసినన్

పరిపూర్ణమ్మగు భక్తియున్ వినయమున్ జాలించి ప్రశ్నించెదన్,
సరిగా నారసి యుత్తరమ్మొసఁగుమా, సత్యమ్మదెట్లున్నదో,
త్వరగా నన్ను సముద్ధరించుటకు నాతంకమ్ము లేమున్న? వా
కిరి కన్నన్ గిరికన్న నేను బరువై కాన్పింతునే, మాధవా!

ధనములు వేడ, రాజ్యసుఖ దర్పము లక్కఱ లేదు విద్య లి
మ్మనను గృపాతరంగిత నిరర్గళ మంగళ భావభంగిమ
మ్మనితర వస్తు సుందర మహాంగరుచిం గనుఁగొన్నఁ జాలు నీ
వనయము నాదు వంకఁ, గమలాక్ష! యిదొక్కటె నిన్ను వేడెదన్!

ఏఁ బతి నీచుఁడున్ ఖలుఁ డపేతగుణుం డధమాధముండు, నా
వాఁడని యాదరింపఁ దగువాఁడు దయానిధివైన నీకుఁ, దా
నేప విషమ్ము గ్రక్కు ఫణులేడ యటైనను జందనమ్ము గా
పాడుట లేదె నీడయయి వాని నమంద ముదమ్మునందగన్.

ఆకలి దాక కోర్వక మహాక్షితి నిగ్గనుమాట మాటకున్
లేకయ బాటలందుఁ గణలేశము లబ్బినచోట మెక్కుచున్
దేకువ దప్పితిన్, హరి! త్వదీయుఁడు కింకరుఁ డన్యుఁ జేరి యా
వాకిటఁ గుక్కయాట మది వాసియె నీ కకలంక! చెప్పుమా!

నరకమునందుఁ గూలుదునొ నాకటఁ బోయెడిదేమి? సిగ్గులే
కరకరి చరించు నిన్నరుని కా తలవంపు లనాథ నాథ! యో
నరహరి నీకొ చూచుకొను, నాపయి నీదు కటాక్ష ముంపకా
కరమున నెత్తి చూపెదరు గాదె నినున్ జనమాడి పోయుచున్.

నరకమునందు బాధల ననారత మేను భరింతు నెట్టులో
మురహర! నా వ్యకర్మగతి మూలమటంచు చటాయోర్మివట్టి, యా
వరణి నిదొక్కటే హృదయశల్యము నన్గని యెల్లవారు పేఁ
డరరె! యనాథుఁడంచనెదరయ్య ప్రభూ! పలుగాకి లోకముల్.

సశేషం.

# పంపకవి

## శ్రీ కె. సుబ్బరామప్ప

తెలుగు కన్నడ సాహిత్యముల సాంగత్యమును గూర్చి మే నెల భారతిలో ప్రకటింపబడిన 16 వ శతాబ్దమువఱకు తెలుగు కన్నడ సాహిత్యముల పరస్పర సంబంధము నందులో వివరించితిని. ఈ వ్యాసమున కన్నడిగుల ఆదికవియైన పంపకవినిగూర్చి తెలుగువారికి పరిచయము గావింప దలచితిని.

కన్నడ సాహిత్యమున మేటికవులు పంప, రన్న, పొన్న అనువారు. వీరిని రత్నత్రయ మందురు. తెనుగు సాహిత్యమున కవిత్రయమువంటివారు వీరు. కన్నడ సాహిత్యమున 9 వ శతాబ్దమున నృపతుంగుడు "కవిరాజమార్గ"మను గ్రంథమును వ్రాసినను, అది లక్షణ గ్రంథమగుటచే 10 వ శతాబ్దమున కావ్యమువ్రాసిన పంపకవియే కన్నడిగుల ఆదికవియని ప్రసిద్ధి వచ్చెను.

పంపకవి ఆంధ్రదేశముతో సంబంధము కలవాడు. ఆంధ్రభాషతోను సంప్రదాయములతోను వీరికి పరిచయము గలదు. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తమ సాహిత్యదర్శినిలో పంపకవి తెనుగునందు కవిత్వము వ్రాసినట్లు కొన్ని పద్యముల నుదాహరించియున్నారు. తెలుగువారికి నన్నయ భట్టారకుడెట్లో కన్నడిగులకు పంపకవియు నట్టివాడు.

ఆనాడు మతము నాశ్రయించుకొని సాహిత్య మభివృద్ధి జెందినది. కన్నడ సాహిత్యము జైనయుగ, వీరశైవయుగ, బ్రాహ్మణయుగ అని విభజించి చెప్పబడినది. అనగా సాహిత్యముపై మతములకెట్టి ప్రభావము కలదో వ్యక్తమగును. పంపకవి సదాచార సంపన్నులైన బ్రాహ్మణ వైదిక కుటుంబమునకు జెందినవాడు. జైన మతావలంబి యయ్యెను. ఆంధ్ర దేశమున నాడు విజృంభించుచున్న వైదికమతము గిట్టక కన్నడ నాడునకు విచ్చేసి యుండెనేమో. అటులనే వైదిక కన్నడిగుడైన నారాయణభట్టు కన్నడ దేశమున 10, 11 శతాబ్దాలలో విజృంభించుచున్న జైనమతము పరిపడక కాబోలు ఆంధ్రదేశమునకు వచ్చి రాజరాజ నరేంద్రుని ఆస్థానమును జేరి నన్నయ్యకు భారత రచనలో సహాయపడెను. పంపకవి ముత్తాత తండ్రియైన మాధవ సోమయాజి మంత్రసిద్ధిపొంది యజ్ఞయాగాదికముల నాచరించి ప్రసిద్ధికెక్కినవాడు. ఈతనిమహిమ చేత వేంగిపతికి గౌరవము. కాని అతని యాగధూమము నుండి జైనమతావలంబియైన తన కీర్తికి శల్యము గలెనని బహుశః పంపడు వ్యసనపడియుండును. ఈ మాధవ సోమయాజి సంతతిలోని అభిరామదేవుడే పంపని తండ్రి. పంపకవికి ఆనూచానముగ వచ్చిన బ్రాహ్మణ సాంప్రదాయముతో క్షాత్రగర్వాన్ని జైనధర్మము కూడ కలిసికొని రెండును పాలును నీరువలె కలిసిపోయినవే గాని ఒకదానితో నొకటి ఘర్షించలేదు. మతాంతరుడైనను నీతనియందు మతాంధత యూడ లేదు. పంపనియందు రెండు సంస్కృతుల సారమును జేరి కొని పుష్టినొందెను ఉదారమయ్యెను దీని ఫలితము అతని కవిత్వమున కానవచ్చును.

పంపని వంశీయులు వేంగిమండలములోని వేంగిపల్లు అను అగ్రహారమున నుండినవారు. వేగినాడు కృష్ణాగోదావరీనదుల మధ్యగల ప్రాంతము ఇది ఆంధ్రదేశమైనను అక్కడ కూడ కొందరు కన్నడిగులు నివసించుచుండిరని గోచరమగుచున్నది. నృపతుంగుడు తన "కవిరాజమార్గమున" (9 వ, శతాబ్దము) కన్నడదేశ విస్తరమును వివరించుచు "కావేరి ఇంద గోదావరి వరం" (కావేరినుండి గోదావరి వరకు అని) చెప్పి యున్నాడు. పంపకవి పెద్దవాడై గొప్పకవి అగు సమయమునకు వేంగిమండలమునకు పశ్చిమమున నుండు కన్నడ నాడునకు సమీపమున గల వేములవాడ యందు రాజ్యము సేయుచున్న అరికేసరి ఆస్థానమును జేరెను. ఈ ప్రభువుయొక్క ఆశ్రయమున కావ్య రచనగావించి భూరిపురస్కార లాభములను పొందెను ("[illegible]") పిమ్మట నితడు కన్నడదేశమున మలెనాడు ప్రాంతమున సంచరించి అందలి ప్రకృతి రామణీయకమునకు అచ్చెరువంది తన కావ్యమునందు దానిని సొగసుగ వర్ణించెను.

మును "అపరాజితమని" పొగడెను. ఈతని కృతులు కన్నడ సాహిత్యమున కొక క్రొత్తయుగము నే సృష్టించెను. జైనయుగమనుటకు మారుగ పంపయుగమయ్యెను. ఆ పూర్వదశలో ప్రబంధరచనకు దిగినకవి, వారు జైనులు కాని, కాకపోని, క్రీ శ 1200 వరకు పంపకవి కావ్యములే ఆదర్శములైనవి ఆదిపురాణమున గద్య పద్యములలో దీర్ఘములైన సంస్కృత సమాసములు కొంచెము కొన్ని పద్యములలో పాదాంత్యములందలి కన్నడ ప్రత్యయములను తొలగించిన యెడల కేవల సంస్కృత రచనలేనా యనిపించును ఈతని రచన "లలితపద" భూయిష్ఠమై "ప్రసన్న కవితాగుణము" లతో నొప్పినది "అక్షర రమ్యత"గలదు. పంపని రచనలోని యీగుణములనే మన నన్నయ్య అనుకరించెను.

భారతము రచించువేళకు ఈతనిలో సంస్కృతముపై కొంత మోజు తగ్గినది అచ్చకన్నడ నుడులను అనేకచోట్ల వాడుచువచ్చెను. లోకానుభవము కూడ అప్పటికి అతిశయించినది. వర్ణనావైచిత్ర్యము కవి మాత్సర్యదృష్టిని తెలియజేయును యుద్ధవర్ణనలలో నీతినిపుణతానుకూల్య ముండెను అతడు స్వయముగ వీరుడు రణరంగమున జొరబడి అక్కడి సన్నివేశములను, విన్యాసములను కన్నార గాంచినవాడు అందువల్లనే యీతని యుద్ధవర్ణనలు స్వభావోక్తులు ఇతడు "ప్రసన్నకథా" కథనమందు దక్షుడు. కుంతీ—సత్యవతి సందర్శనము, కర్ణజననము, కుంతీ కర్ణ సంభాషణము, శతశృంగ పర్వతమున పాండురాజ కథ మొదలైనవి ఇందుల కుదాహరణములు

నవీన కల్పన, రసానుగుణమైన కథాశరీర రచన, వస్త్వనురూప రసనిర్మాణము, రసమునకు తగినటు ఛందస్సును వాడుట, కావ్యసౌందర్యమును చెడనీయక అంగోపాంగములను వర్ణించుట, పంపని రచనంగు కావలసిన అతడు పాత్రలకు జీవమిచ్చి యెదుట నిల్పి మాట్లాడునటు చేయును సహజముగ వర్ణించును. సన్నివేశమునకు తగినట్లు మితిమీరక కథను నడిపించును. బహువిధప్రయోగ చతురతను చూపును సముచ్చయములను విరివిగా వాడుట ఇతనికి ఇష్టము "హితమిత మృదువచన," "ప్రసన్న గంభీర రచన చతుర," "శోభాలం మార్గగర్భం, మృదుసందర్భం, విచారక్షమం, ఉచితపదం, శ్రావ్యం" అని తన కావ్యగుణములను గూర్చి నిరూపించుకొన్నాడు "లలిత పదం" "ప్రసన్న కవితాగుణం," "అక్షర రమ్యత"—వీనినిగూర్చి కూడ చెప్పికొన్నాడు

పంపకవి మహాభారతమందలి యొక అద్భుతమైన భీమదుర్యోధనుల గదాయుద్ధ కథనే రన్నకవి "గదాయుద్ధ" అను గొప్ప కావ్యముగా వ్రాసినాడు పంపని శైలిని మెచ్చికొని యాతని కొన్ని వాక్యములను చిరస్మరణలచే తన గ్రంథమున చేర్చికొన్నాడు ఈతని కల్పనా చాతుర్యమున కొక యుదాహరణము

"ఇదగో కేశ్వరాత పత్ర స్థగిత దశదిశా
మండలం, రాజచక్రం,
పుదిదత్తా డిత్తిసంగిత్తి దలో కే
కురురాజాన్వయం, మత్ప్రతాప
క్కె దహేందం నోడికుర్వ ద్విరదదవ
మహాభారత కాండియాత్ర
బ్బ దకాఫి పేటం పాయూవ్యమె బగెయు
ఛిన తేక్కె కహా ప్రపంచం"

ద్రౌపదీ కేశపాశమే ఒక ప్రపంచమైనది దానియందు అనేక రాజాధిరాజులు అడగిపోయిరి కౌరవ వంశమే దానియందు అంత్యమయ్యెను మహాభారత సంగ్రామమునకు అది నాంది అయ్యెను కౌరవుల నుండి ద్రౌపదికి గల్గిన అవమానమే మూలకారణము కదా! ఇది పై పద్యము యొక్క భావము.

## నన్నయ అనుకరణ

పంపకవిని నన్నయభట్టు కొన్ని సందర్భములలో అనుకరించి యున్నాడు తనకు సహాధ్యాయుడును, ఇష్టుడునైన నారాయణభట్టుచే పంపని రచనా రీతులను, వర్ణనా కౌశల్యమును, 'ప్రసన్న కవితార్థ యుక్తిని', 'అక్షర రమ్యతను' తెలిసికొన్నాడు. అనుకరించబడిన వానిని అందు కొన్నాడు చాళుక్యులు కన్నడము తెలియనివారు కారు. చాళుక్యులు కన్నడిగులు సంబంధీకులు (చూ. డా. నేలటూరి వెంకటరమణయ్యగారి "వేములవాడ చాళుక్యులు" "భారతి" డిసెంబరు 1948) ఒక శతాబ్దమునకు ముందే రచించబడినట్టి పంపభారతము సంగతి రాజరాజనరేంద్రుని ఆస్థానమున ప్రసిద్ధికి వచ్చియే యుండును. కన్నడ కవి నారాయణభట్టుయొక్క సహాయమునుగూర్చి నన్నయ గ్రంథాదిని గొప్ప ఉపమానము

లతో ప్రశంసించుటనుబట్టి పరికించినచో పంప భారతమును నన్నయయు అతని బాగుగ పరిచయము చేసికొనెనని తెల్లమగును.

నన్నయ అనుకరించిన పట్టులు కొన్ని మాత్రము సూచింతును.

నన్నయ గ్రంథాదిని వ్రాసిన "శారదరాత్రు"లను పద్యముతో దీటైనది పంపభారతమున "లలితపదం ప్రసన్న కవితాగుణ" ఇత్యాదితో ప్రారంభమగును. అంకితపద్ధతి, గ్రంథాదిని దేవతాస్తుతి పంపని అనుకరణయే. ఆదిపర్వమున శకుంతలోపాఖ్యానము కణ్వాశ్రమమును దుష్యంతుడు దర్శించినప్పుడు, ఆశ్రమప్రాంతమున వైరి వర్గములు విడి జంతుజాలము అన్యోన్యముగ నుండుటయు, శుకములు వేదపఠనము చేయుచున్నదియు పంపకవి భారతములోనిది. పంప భారతమున పాండురాజు శతశృంగ పర్వతమునకు పోయినప్పుడు అందలి మునిఆశ్రమము లిట్లుండెనని పంపకవి వర్ణించియున్నాడు.

"మునికుమారరు ఓదువ వేదవేదాంగగళం తప్పిదొడె జరెదు బగ్గిసువ పంజరద గిణిగళుమం, సురభిగళ కెచ్చల మొలెగళ నున్నువ మరిగళం పులిగళుమం మొలెగళ మున్నా కోరళనరిగళుమం, తమ్మ కెతె సిల దాదున కోరం శ్వరి గళం పిడుదు తెగెం కరికలభంగళుమం, ఆ గళాగళంద పాయ్వ పులిగళ మరిగళ్గే పరిదాడువ తరుణ హరిణంగళుమం సౌందర్యం పట్టు"

## నన్నయ :

"శ్రేణిగుంభంబుగా సామగానంబులు
చదివెడుశుకముల చదువుదగిలి
కదలక వినుచుండు కరులును కరికర
శీతలచ్ఛాయ తచ్ఛీకరాంబు .
. . సౌందర్యమంది"

## కృతిపతి వర్ణన

పంప "శ్రీ పతిగె యుద్ధతల్ల మహీపతిగె తెగ బ్రిఘట్టి" మొదలైన పద్యాలు

నన్నయ "రాజకులైక భూషణుడు" "విమలాదిత్యతనూజుడు" మొదలైన పద్యములలో ఇందు మించు పోలికలు గలవు

ఛందోనుకరణములు, పద్యముల ఎత్తుగడలు, విభక్తి పల్లటములు, వర్ణనారీతులు కొన్ని పట్టులలో పంపని అనుకరించినాడు నన్నయ

పంపకవి "కవితా గుణార్ణవ" "సుకవిజన మనోమానసోత్తంసహంస," "సంసార సారోదయ" మొదలైన బిరుదావళిని సంపాదించుకొన్నాడు. కవిని ఆ పురాణమును కూడ తెలుగున, విక్రమార్జున విజయము (భారతము) అని తెలుగున ముగించు నాకే మహాకవి యనిపించుకొనుట పూర్వజన్మ సుకృతము ప్రతిభాశాలియగుటకు పుణ్యము చేసి యుండవలెను అటువంటి కవిని బడయుటకు జనులు నోచి యుండవలెను ఇటువంటి కవిని బడసిన కన్నడిగులు ధన్యులు.

## ఆధార గ్రంథములు

1 "పంప" శ్రీ టి. ఎం. శ్రీకంఠయ్య ఎం ఏ., (మైసూరు విశ్వవిద్యాలయ ప్రకటన)

2. "కన్నడ సాహిత్య" శ్రీ కె వెంకటరామప్ప ఎం. ఏ., (మైసూరు విశ్వవిద్యాలయ ప్రకటన)

3 "నాడోజ పంప" శ్రీ ములియ తిమ్మప్పయ్య (మంగళూరు)

4. కన్నడ సాహిత్యచరిత్ర" శ్రీ రం. శ్రీ ముగళి.

వంగా బతికేరు - ఇందులో మెప్పుకో తగ్గదేమీ లేదు '

అతనితో వాదించి లాభంలేదని ముందే చెప్పాను.

రెండు ఎత్తైన కొండల మధ్య పచ్చలోయ - నానాకాలంలో అలా పచ్చటితో నిండి వుంటుందని వినికిడి. అవతల కొండమీద కొన్ని చెట్లు కనిపించాయి. కాని అక్కడికి వెళ్ళేమార్గం మాత్రం కనపడలేదు. రమణ ఆ దృశ్యం ఫోటో తీయటానికి కెమెరా సరిచేస్తున్నాడు. సుందరి లోయకేసి తదేక దీక్షగా చూస్తోంది. నేను ట్రైపాయిడ్ సరిచేస్తున్నాను.

సుందరి ఒక్కసారిగా కెవ్వుమంది

బాబు కనపడలేదు. ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ మమ్మల్ని మేం మర్చిపోయి అతన్నిగురించి ఆలోచించనే లేదు. అసలే అల్లరిపిడుగు. అంతులోనూ కొత్తచోటు. రమణ కంగారుగా నాలుగువైపులా చూశాడు 'అమ్మోయ్' అని అరుస్తూ బాబు గుహలోంచి పరుగెత్తుకొచ్చాడు

ఆ గుహలోపల ఎడంపక్కన చిన్న గదిలా వుంది. అక్కడంతా చీకటితో నిండివుంది. ఒంటరిగా వస్తే ఎంతటి గుండెనిబ్బరం వున్నవాళ్ళైనా జడుసుకుంటారు. అయినా అతనా చీకట్లోకి ఏముందని వెళ్ళాడో? కళ్ళు బెదురుతున్నాయి. ముఖంనిండా చెమటబొట్లు. మళ్ళీ గట్టిగా అరిచాడు

'ఏంట్రా? ఏమయింది? అక్కడేం కొండ కోళ్ళున్నాయా?' అని గదమాయించాడు రమణ. బాబు సమాధానం చెప్పక వెర్రిగా చూశాడు

'జడుసుకున్నట్టున్నాడు. రాక్షసుడిలా మళ్ళీ మీకు అపశకునం. ఇంక దిగి పోదాం—పదండి—చాలు' అని సుందరి సమాధానంకోసం ఎదురుచూడకుండా గబగబా దిగిపోయింది. చేసేదిలేక మేం కూడా వెంబడించాం. అదీ! అప్పుడు జడుసుకున్నాడు—అందుకే యీ జ్వరం

నా ఆలోచనలు ఒకచోటికి వచ్చి ఆగిపోవటం రమణ నన్ను నవ్వుతూ పలకరించటం ఒక్కసారే జరిగాయి. హఠాత్తుగా ఆఫీసులో ఇన్స్పెక్షన్ వచ్చి పడిందని, ఫోన్ చేసి మళ్ళీ వెళ్ళవలసి వుంటుందని చెప్పాడు. ఆఫీసుదుస్తులైనా విప్పకుండా తిన్నగా బాబుపడుకున్న మంచందగ్గరకు వచ్చాడు. అమాయకంగా నవ్వుతూ నిద్రపోవటం అతని కోపాన్నంతా కరిగించింది. మెడవరకూ దుప్పటి కప్పి వుండటంవలన మెడలోని దారం అతనికి కనిపించే అవకాశం లేదు. సుందరి తెలివైంది కనక ముందుజాగ్రత్త పడింది. వ్యక్తిగతాభిప్రాయం ఎలావున్నా ఈ ప్రత్యక్ష నిదర్శనాన్ని ఖండించలేకపోయాను. రమణ బాబు నుదుటిమీద చెయ్యివుంచి చూశాడు

'అరే! జ్వరం నార్మలుకు వచ్చేసినట్టుందే! చిత్రం! డాక్టరు మందుకోసం వెళ్ళకుండానే టెంపరేచర్ నార్మల్ చేసుకున్నాడే! సుందరీ! వడ్డించు! ఇదుగో వస్తున్నా' అంటూ కదిలిపోయాడు

సుందరివిడిచిన దీర్ఘమైన నిట్టూర్పులో వుంటే అర్థం నా ఒక్కడికే తెలుసు. పెదవుల మధ్యనుంచి నీటిబుడగలా పేలటానికి సిద్ధంగావున్న నవ్వును బలవంతంగా అణచుకొని వంటింట్లోకి వెళ్ళింది

నాటకరంగంమీద ఓపాత్ర ఎడంపక్కనుంచి వెళ్ళగానే కుడిపక్కనుంచి మరోపాత్ర ప్రవేశించినట్టు రమణ చేతిలో థర్మామీటర్తో ప్రత్యక్షమయ్యాడు. ఇంకో నిమిషంలో బాబు మేలుకుంటాడనుకున్నాను. టెంపరేచర్ చూసే ప్రయత్నంలో ఆ 'మంత్రదారాన్ని' కనుక్కున్నాడు

'సుందరీ!' అని పిలిచాడు

పాత్రలన్నీ మళ్ళీ రంగంమీదికి చేరుకున్నాయి

'చూడండీ! మీకు కోటి నమస్కారాలు. నన్ను మీరేమన్నా చేసినా, ఫరవాలేదు. కాని బాబునుమాత్రం దక్కనీయండి. మీకు తెలీదు. ఒకరు చెబితే అర్థంకాదు. చిన్నపిల్లలు జడుసుకోటం సహజం—అందుకు ఏ డాక్టరూ ఇంతవరకూ మందు కనిపెట్టలేదు. వైద్యం చేయలేరు'

సుందరి దీనంగా చెప్పుకుపోయింది

రమణ ఫక్కున నవ్వేసి ఆ దారం కాస్తా పుటుక్కున తెంపేశాడు

'పిచ్చివెర్రిపిల్లవు సుందరీ' అంటూ రాగయుక్తంగా పలికాడు. ఈ సందడిలో బాబు మేల్కొని గట్టిగా ఏడవటం మొదలుపెట్టాడు. అతని దృష్టిలో ఇలాంటి నమ్మకాలకు ప్రాధాన్యం లేదు.

మందిరమును నిర్మించి ప్రజల కప్పగించిన ఉదార పురుషుడీయన. వీరి ఆత్మ చరిత్రకు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు పీఠిక వ్రాస్తూ 'ఇది వెంకటశివుడిగారి సొంత కథకాదు ఆంధ్ర దేశంలోను, హిందూదేశంలోను, ప్రపంచమందును కలిగిన భావపరివర్తన కూడా ఇందున్నది' అన్నారు.

'సూర్యనారాయణీయము' మరొక స్వీయ చరిత్ర. ఇది 'సామాన్య సంసారి జీవిత కథ' అని రచయిత వలూరి సూర్యనారాయణరావుగారు చెప్పుకున్నారు. బందరులో వకీలుగా, సంఘ సంస్కర్తగా, రాజకీయ వాదిగా పేరుపడ్డవారీయన. అన్ని విషయాలలోను స్వతంత్రాలోచన గల వ్యక్తి. పరోపకారం ఆదర్శంగా పెట్టుకున్నవారు. తాము స్వార్జితంగా సంపాదించిన డెబ్బదివేల రూపాయల ఆస్తిని విద్యాసంస్థ కిచ్చివేసిన వదాన్యులు. మానవుడు స్వశక్తి మీదనే ఆధారపడి జీవించడం గౌరవమనీ, కర్మయోగులుగా వుండి ప్రజాసేవ చేయవలెననీ, ఈయన తమ స్వీయచరిత్ర ద్వారా ప్రబోధించారు.

'కళాప్రపూర్ణ' చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి స్వీయచరిత్రకొక ప్రత్యేకత వున్నది. ఈయన పుట్టంధుడు కాదుగాని తరువాత దృష్టిని కోల్పోయారు. పుట్టింది బహు సామాన్యకుటుంబం. కాని వ్యక్తిత్వం గొప్పది. చిలకమర్తివారు వీరేశలింగంగారి అనుయాయుల్లో సంఘ సంస్కరణోద్యమానికీ, సాహిత్యానికీ, తెలుగు నాటకరంగానికీ అపారమైన సేవచేశారు. మొదటినుంచీ వీరికి ప్రజాహితజీవనం గడపవలెనన్న వాంఛ వుండేది. స్వయంగా ఎక్కడికీ పోలేకపోయినా, ఎవరినో ఒకరిని వెంటబెట్టుకొని శ్రమపడి ప్రతి మహాసభకూ హాజరై వక్తల ఉపన్యాసాలను శ్రద్ధగా విని, నిష్పాక్షికంగా తమ అభిప్రాయాలను వ్యక్తీకరించేవారు. ప్రజాహిత జీవనంలో ఉద్వేగం కలిగించిన ప్రతిభాశాలి ఈయన. హాజరైన మహాసభలు, ఇచ్చిన ఉపన్యాసాలు అనేకం. ఆంధ్రదేశంలో విద్యావ్యాప్తికీ, సంఘ సంస్కరణకూ, మతోద్ధరణకూ, నిమ్నజాతుల సంక్షేమానికీ, మహిళాభ్యుదయానికీ రాజకీయ సంస్కరణలకూ, లలితకళల అభివృద్ధికీ ఎంతో పాటుపడటమేగాక అనేక గ్రంథాలు రచించి ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి 'కళాప్రపూర్ణ' బిరుదుపొంది, తెలుగు సాహిత్యంలో చిరస్థాయిగా వుండే స్థానం సంపాదించుకొన్న ప్రజ్ఞావంతులు. మన స్వీయ చరిత్రలలో చిలకమర్తి వారి స్వీయచరిత్ర పాఠకులకు అత్యంతానందం కలుగజేస్తుంది. కారణం వారి వచన రచనాశైలి, విషయ ప్రాధాన్యము, నిగ్రహాయుతము అయిన వారి చెప్పే విధానమూను.

ఆంధ్రోద్యమంలో, భారతదేశ రాజకీయ రంగంలో, విప్లవోద్యమంలో పనిచేసిన ముగ్గురు ప్రముఖుల స్వీయచరిత్రలు తెలుగు సాహిత్యానికి అలంకారప్రాయమైనవి. ఒకరు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు, శాసనసభ్యులుగా, ఆంధ్ర మహాసభాధ్యక్షులుగా, కాంగ్రెసువాదిగా గాంధిమహాత్ముని గౌరవాదరాలకు పాత్రుడైన మహావ్యక్తి. ఈయన భారత ప్రథమ స్వాతంత్ర్య సమరం నడిచిన కొన్నేళ్లకే దేశభక్తుడు పుట్టాడు. ఆయన స్వీయచరిత్ర డెబ్బయి ఏండ్ల ఆంధ్రదేశ చరిత్ర భారతదేశ చరిత్రకూడా అందులో వున్నది. సత్య తత్పరత, ఆస్తిక్యము, వినయం, నిరంతర సేవాసక్తి, ఆత్మవితరణం — ఇవి దేశభక్తుని ఉత్తమ గుణాలు. "జీవితములో సుఖదుఃఖము లనునవి వ్యక్తికి మాత్రమే సంబంధించినవి. పరుల కుపకరించునదే సార్థక జీవనమని యెంచును. అయితే ఈ నిర్ణయము లోకులు చేయవలసినదే. సాధారణముగ ఎవ్వరి జీవితమందైనను సుఖదుఃఖములు రెండును అనుభూతములగుచుండును. దినదినమును నూతనానుభవములు కలుగుచుండుటచే, జీవితము నూతన కళలతో నొప్పారు నొక నాటకరంగమువలె నుండును. నిర్మల వర్తనము కలిగి, సత్యనిష్ఠతో ప్రవర్తించువారికి మనః క్లేశమునకు కారణముండదు." అని కొండా వెంకటప్పయ్య పంతులుగారు తమ జీవితానుభవమునుగూర్చి చెప్పుకొన్నారు.

రెండవది టంగుటూరి ప్రకాశం పంతులుగారి 'నా జీవితయాత్ర' అనే ఆత్మకథ. ఆంధ్రప్రజానాయకులుగా ప్రకాశంగారు అనితరమైన స్థానం పొందారు. లక్షలు సంపాదించి, లక్షలు ఖర్చుపెట్టిన త్యాగి. గుండె నిబ్బరానికీ, ధైర్య సాహసాలకూ, త్యాగాలకూ ప్రకాశం పంతులుగారిని చెప్పుకొని మరొకరిని చెప్పాలి. ఆంధ్రుల గుణగణాలకు ఆయన ప్రతినిధి. కాంగ్రెసువాదిగా, పత్రికా సంపాదకుడుగా, మంత్రిగా అవిభక్త మద్రాసుకూ, ఆంధ్ర రాష్ట్రానికీ ముఖ్యమంత్రిగా ఆయన చేసిన సేవ అనుపమమైనది. అసలు దక్షిణ భారతంలో జాతీయోద్యమానికి ఊపిరిచ్చిన ధీరోదాత్తుడు ఆయనే. ప్రకాశం పంతులుగారి స్వీయ

చరిత్ర రచయితలకు అవశ్యపాఠ్యమైన వీరగాథ. పైగా ఇది సాహిత్యమూల్యం కూడా సంతరించుకొన్నది.

మూడవది 'నేను-నా దేశం' అను పేరుతో గదర్ వీరుడు దర్శి చెంచయ్యగారు వ్రాసుకున్న స్వీయ చరిత్ర 'పోయిన అర్ధ శతాబ్దిలో మనదేశంలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో వచ్చిన ప్రతి మహోద్యమం దర్శి చెంచయ్యగారి జీవిత దర్పణం మిగిల్చింది' అని టీకా కర్తలన్న మాట అక్షరాలా నిజం. అటు నాయకుడూ కాక ఇటు అనుచరుడూ కాక, ముక్కుకు సూటిగా పోయి తనకు తోచిన ఉద్యమంలో పాల్గొన్న చెంచయ్యగారి ఆత్మకథ ఉత్సాహకరమైంది. తన స్వీయచరిత్రకు ప్రస్తావన వ్రాస్తూ "మనదేశ మహోద్యమానికి ముకుట ప్రాయమయిన గాంధీ మహాత్ముని జీవితచరిత్ర తలపుకు వచ్చి సాహసించలేకపోయ్యాను. అంతగొప్ప ఆత్మకథ తరువాత నేను వ్రాయడమేమిటని నాలో నేను నవ్వుకొన్నాను. కాని ఆ మహోద్యమంలో మహాత్ముని జీవితమెంత అల్లుకుపోయి ఉంటే నా సమిధకూ అందులో తావు లేక పోలేదు అన్న భావం మాత్రమే నన్ను ఈ రచనకు ప్రేరేపించింది" అని చెంచయ్యగారు చెప్పుకున్నారు. భారతదేశం పరాధీన స్థితినుంచి బయటపడటానికి నవ్యాంధ్ర నాటి దేశభక్తులలో ఎంత బలీయంగా వుందో ఇలాంటి విప్లవ వీరుల జీవిత చరిత్రలవల్ల తెలుస్తుంది.

డాక్టర్ కె యస్ కేసరిగారు 'నా చిన్ననాటి ముచ్చట్లు' అంటూ తమపత్రిక గృహలక్ష్మిలోనూ, ఇతరత్రా కొన్ని వ్యాసాలు వ్రాశారు. అవే పుస్తక రూపంలో వెలువడ్డాయి. డాక్టర్ కేసరిగారు రాజకీయ నాయకులు కారు. వైద్యులు. పత్రికా సంపాదకులు సేవా పరాయణులు, వితరణ శీలురు. వైద్యరూపంగా, పత్రికా ముఖంగా, విదుషీమణులకు స్వర్ణ కంకణ బహూకరణ రూపముగా ఆయన స్త్రీలకు చేసిన సేవ సంస్మరణీయమయినది. మద్రాసులో మైలాపూరులోని కేసరి విద్యాలయం, త్యాగరాయనగర్‌లోని కేసరి ప్రాథమిక పాఠశాల ఆయన దాతృత్వానికి నిదర్శనాలు. దాదాపు రెండులక్షల రూపాయలు ప్రజార్థ హితైక కార్యాలకు దానంచేసిన వదాన్యుడాయన. అంతేకాదు పండితులను గాయకులను సత్కరించిన కళాపోషకుడుకూడా. ప్రాచీన కళా సంస్కృతుల పట్ల అపారాభిమానాలు గలవ్యక్తి డాక్టరు కేసరిగారు.

పండితులూ, పరిశోధకులూ, యోగనిష్ఠాపరులూ అయిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'ప్రజ్ఞా ప్రభాకరం' అను పేరుతో ఆత్మకథ వ్రాసుకున్నారు. మరి కొందరు పద్యరూపంలో తమ స్వీయచరిత్రలనూ స్వీయానుభవాలనూ వ్రాసుకున్నారు. తిరుపతి వేంకట కవులలో ఒకరైన శ్రీ చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారు 'కాశీ చర్య' ఈ సందర్భంలో సంస్మరించదగింది.

సాధారణ జీవిత చరిత్రకూ, స్వీయ చరిత్రలకూ ఒక భేదం వుంది ఒకరు మరొకరి జీవిత చరిత్ర వ్రాసినప్పుడు అన్ని విషయాలు సమగ్రంగా లభించక పోవచ్చు కాని ఎవరి చరిత్రను వారే వ్రాసుకొన్న పక్షంలో సంగతులన్నీ సంపూర్ణంగా వివరించడానికి వీలుపడుతుంది అయితే స్వీయచరిత్రలో కూడా ఉత్తమగుణాలనే వ్రాసుకొని దుర్గుణాలను, లోపాలను వెల్లడించడం జరుగక పోవచ్చు అయితే మన స్వీయచరిత్ర కారులు వారిలోపాలను చాలవరకు నిష్పక్షపాతంగా వెల్లడించారు. మహానుభావులైన వారి చరిత్రలు అవశ్యం పఠనీయమైనవి అవి మనకు గతాన్ని తెల్పి, భవిష్యత్తును ప్రబోధించి, వెలుగు నీడలలో కూడిన ఈ జీవనయాత్రలో మార్గ సూచికలుగా ఉపకరిస్తాయి.

మన గద్యరచనలో స్వీయచరిత్ర విభాగం ఇంకా విస్తృతం కావడం అవసరం ఇంకా ఎందరో పెద్దల స్వీయచరిత్రలు వెలువడాలి ముఖ్యంగా పద్మభూషణ మాడపాటి హనుమంతరావు పంతులుగారు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, తల్లావఝుల శివశంకరస్వామిగారు, విశ్వనాథ సత్యనారాయణగారి వంటి అనుభవజ్ఞులు సాహితీపరులు తమ స్వీయ చరిత్రలను వ్రాసి ప్రకటించాలి. ఆ స్వీయచరిత్రలు వెలువడడానికి వారి మిత్రులు ప్రోద్బలంచేసి, తద్వారా స్వీయచరిత్ర విభాగాన్ని మరింత సంపన్నం చేయాలి.

# చతుర్ముఖులు

శ్రీ అంగర సూర్యారావు

**పాత్రలు:**

| | |
|---|---|
| గోపాలరావు | రామచంద్రకవి |
| కీర్తిశ్రీ | కమలాకరం |
| విశ్వనాథం | గణపతి |
| వెంకటసుబ్బయ్య | పాపారాయుడు |

రంగమణి.

స్థలం: కళామంటపం

సమయం: రాత్రి 7 గంటలు.

హాలుమధ్య ఒకద్వారం కనిపిస్తోంది. తలుపులు మూసివున్నాయి లోపలి నుంచి నృత్యంచేస్తున్నట్లు మువ్వల ధ్వని, పాట - తక్కువస్థాయిలో విని పిస్తున్నాయి హాలులో — సింహాసనం ఆకారంలోవున్న ఒక కుర్చీ, దాని ముందు అందంగా అలంకరించబడిన ఒక టేబిలు వున్నాయి టేబిలుకు కుడి వైపున మూడు కుర్చీలు వున్నాయి. కుడివైపునుంచి కీర్తిశ్రీ వస్తాడు. వయస్సు 35 సంవత్సరాలు. ఖద్దరు లాల్చీ, పంచె, భుజంమీద ఖద్దరు శాలువా-చూడగానే 'కవి' అని తెలుస్తుంది కీర్తిశ్రీ హాలు ఖాళీగా వుండడం చూసి నిరుత్సాహపడతాడు ఒకక్షణం ఆలోచించి హాలుమధ్య వున్న ద్వారం దగ్గరకు వెళతాడు. చెయ్యి వెయ్య గానే ఒక్కసారిగా తలుపులు తెరుచు కుంటాయి ఉధృతంగా మువ్వలధ్వని, క్షేత్రయ్య పదంలోని చివరి చరణం వినిపిస్తాయి.

"...దేవరే వరుడు కావలెనని
భావజుని పూజ లొనరించిన
ఆ వనితవే నేమి సెల వీరా,
సిగ్గేల రేరా!"

లోపలినుంచి గణపతి వస్తాడు వయస్సు 18 సంవత్సరాలు. లాల్చీ, పరాయి వేసుకున్నాడు కాళ్ళకు మువ్వలు వున్నాయ్.)

గణపతి (కీర్తిశ్రీని పరిశీలనగా చూస్తూ) ఎవరువారు?

కీర్తిశ్రీ నేను కీర్తిశ్రీని—విశ్వనాథంగారు వున్నారా?

గణ మీ పేరు ఎక్కడో విన్నట్టుంది! (ఆలోచిస్తాడు)

కీర్తి (తేలిగా) అహా! దానికేముంది! వినేవుంటావు.

గణ (ఏదో జ్ఞప్తికి వచ్చినట్లు) మీరు పత్రికలలో యేమైనా రాస్తూవుంటారా?

కీర్తి చాలా రాసేవాణ్ణి.

గణ అద్దదీ! అలా చెప్పండి. మిమ్మల్ని చూడగానే అమాంతంగా కవిగారని తెలిసిపోయింది. లోపలికి దయచేయండి

కీర్తి తీరిక లేదు. యిప్పుడు నేను రాచకార్యంమీద తిరుగుతున్నాను.

గణ: కవులకు రాచకార్యాలేమిటి చెప్మా!

కీర్తి: అబ్బాయీ! నువ్వు చిన్నవాడవు. నీకు యీ పెద్ద విషయాలు తెలియవు ఇటీవల సాహిత్య

రంగాన్ని కూడా రాజకీయరంగానికి దగ్గరగా తీసుకువెళ్ళాం.

విశ్వనాథం (లోపలినుంచి) గణపతీ! గణపతీ!

గణ (ద్వారం దగ్గరకు వెళ్ళి) యిక్కడే వున్నానండి మీకోసం యెవరో వచ్చారు

విశ్వ (లోపలినుంచి) యిప్పుడెవరురా దిగబడ్డారు?

గణ (పేరు మర్చిపోయి) కీర్తి. కీర్తి

(విశ్వనాథం లోపలినుంచి వస్తాడు. తెల్లగా, లావుగావున్నాడు సుప్రసన్న ముఖం, గిరజాలు, గాస్కో లాల్చీ, పంచె—నాట్యాచార్యుడికి కావలిసిన లక్షణాలన్నీ వున్నాయి వయస్సు 30 సంవత్సరాలు)

విశ్వ: (కీర్తిశ్రీని గుర్తించి చిరునవ్వుతో) ఓహో! మీరా కీర్తిశ్రీగారూ! ఎవరో అనుకున్నాను

కీర్తి: రామచంద్రకవిగారు రాలేదా?

విశ్వ లేదండీ నేనూ వారికోసమే చూస్తున్నాను

కీర్తి (రిస్టువాచీ చూసి) ఎంతో టైంలేదు ఏర్పాటులు యింకా పూర్తికాలేదు నేను వెళ్ళి రామచంద్రకవిగార్ని తీసుకువస్తాను (కుడివైపు వెళుతూవుంటాడు)

విశ్వ కీర్తిశ్రీగారూ! చిన్నమాట! (కీర్తిశ్రీని సమీపించి) గోపాలరావుగారివంటి సుప్రసిద్ధ నాయకుడు మీ రచయితల సమావేశానికి వస్తున్నందుకు నాకు చాలా సంతోషంగావుంది

కీర్తి: (ప్రసన్నుడై) మీవంటి సహృదయులకు సంతోషంగానే వుంటుంది (స్వగతం) కాని . వుంటారు చూడండి కొందరు

విశ్వ పోనిద్దురూ! వాళ్ళ మాటలను పట్టించుకుంటే మనం సంఘంలో మర్యాదగా బ్రతకలేం

కీర్తి మీరేదో చెప్పబోయి మానేశారు

విశ్వ అహా! మరేంలేదు యీ సమయంలోనే గోపాలరావుగారికి నాపేరు కొంచెం సిఫారసు చేయించాలి

కీర్తి: తప్పకుండా చేయిద్దాం మన రామచంద్రకవిగారు యెంత చెబితే అంత దానికి తిరుగులేదు

విశ్వ మీరు నలుగురూ కలిసి నాటక సంఘంలో నాపేరు పడేలా చూడాలి

కీర్తి తప్పకుండా చూద్దాం. యిప్పుడే వస్తాను (కుడివైపు వెళ్ళిపోతాడు)

విశ్వ (ఆలోచిస్తూ) యిది మంచి సమయం

గణ దేనికండి?

విశ్వ గోపాలరావుగారిని మంచిచేసుకునేందుకు

గణ ఆయన్ని మంచిచేసుకోవడం యెందుకు?

విశ్వ ఈనాడు కళారంగం అంతా ఆయన చేతుల్లో వుంది ఆయన తలుచుకుంటే యేమైనా చెయ్యగలరు

గణ అయితే మన నర్తనశాలకు ఆహ్వానించండి. నేను నాలుగు నాటికలను అభినయించి చూపిస్తాను

విశ్వ నువ్వు అభినయిస్తే లాభంలేదు — సర్వాంగ శోభితమైన, సింహమధ్యమ అయిన లలనామణి కావలి

గణ అటువంటి నర్తకి యిప్పుడు యెక్కడ దొరుకుతుందండి?

విశ్వ అదే ఆలోచిస్తున్నాను మంచి చిక్కువచ్చి పడింది గోపాలరావుగారిని ఆహ్వానిస్తాం బాగానే వుంది కనీసం ఒక శిష్యురాలిద్వారా ఆయనకు పూలమాల సమర్పించాలి

గణ (గుండెలమీద చెయ్యి వేసుకొని) నేను స్వయంగా సమర్పిస్తానండి.

విశ్వ (కోపంతో) పోకోవోయ్ అందుకు నువ్వు పనికిరావు

గణ (నిరుత్సాహపడి) అదేమిటండీ? నాకేంలోటు?

విశ్వ (విసుగ్గా) నీకేం లోటులేదురా నాయనా!— కానీ ఆడవాళ్ళద్వారా సమర్పింప చెయ్యడం ఒక ఫాషన్

గణ యింత ఆకస్మికంగా శిష్యురాలు యెలా దొరుకుతుందండి?

విశ్వ యిదివరకు కోమల, కల్పవల్లి వుండేవారు. వాళ్ళు వుంటే ఈ బాల్లో

గణ (మధ్యలో అందుకొని) వాళ్ళు యిప్పుడు గోపాలయ్యగారిదగ్గర నేర్చుకుంటున్నారండి

విశ్వ ఆ గోపాలయ్య మన ప్రాణానికి యముడులా తయారయ్యాడు.

గణ ఆయనదగ్గర చాలామంది నేర్చుకుంటున్నారండి.

రాము: ఒకసారి లోనికి వెళ్ళి చూద్దాం. (గదిలోకి వెళ్ళి పోతాడు)

విశ్వ: (భయంతో) ఉండండి. వద్దండి

కీర్తి (ఆశ్చర్యంతో) యేం?

గణ (ముందుకు వచ్చి) అన్నీ సామాను చిందర వందరగా అడ్డంగా వున్నాయండి ఇంకా యేమీ సర్దలేదు

కీర్తి అటువైపు హాలు ఖాళీగానే వుంది అక్కడ పార్టీ యేర్పాటు చేద్దాం తరవాత సమావేశం యిక్కడ జరుపుకోవచ్చు

(కీర్తి ముందు—వెనుక రామచంద్రరావు, కమలాకరం ఎడమవైపు వెళుతూ వుంటారు)

విశ్వ రామచంద్రరావుగారూ!

(రామచంద్రరావు ఆగి వెనక్కి తిరిగి చూస్తాడు కీర్తి, కమలాకరం నిష్క్రమిస్తారు)

రాము: ఏమిటో త్వరగా చెప్పండి

విశ్వ: నా మాట మరచిపోయారా?

రాము దేన్ని గురించి?

విశ్వ నాటక సంఘంలో నా సభ్యత్వం గురించి

రాము ఆహా! ఆవిషయం నేను మరిచిపోలేదు నాటికా తయారుచేసేటప్పుడు నేను దగ్గరే వుంటాను

విశ్వ మీ మేలు మరచిపోను నాటక సంఘంలో నేను మీ సిద్ధాంతాలకు అనుకూలంగా నడుచుకుంటాను.

రాము తరవాత స్థిమితంగా మాట్లాడదాం (వెళ్ళిపోతూ వుంటాడు)

విశ్వ: మరో చిన్న మనవి

రాము: నాకు టైం లేదు త్వరగా చెప్పండి.

(రంగమ్మ అకస్మాత్తుగా తలుపులు తెరిచి ద్వారం దగ్గర నిలబడుతుంది)

రంగ: (చిరాగ్గా) అబ్బబ్బా! యేంటీ పాడు.

(ఆమెను చూడగానే విశ్వనాథం, గణపతి కంగారుపడతారు గణపతి ఆమెను లోపలకు నెట్టి తలుపు దగ్గరకు వేస్తాడు)

రాము ఆవిడ యెవరు?

గణ: ఆవిడ మా గురువుగారి...

విశ్వ (ఆతృతంగా మధ్యలో అందుకొని) శిష్యురాలు లెండి

రాము అలా వుందేం?

గణ జానపద నృత్యంకోసం వేషం వేయించామండి (గణపతి తలుపు గట్టిగా పట్టుకొని నిలబడతాడు)

విశ్వ రామచంద్రరావుగారూ! మీరు నాకు మరో చిన్న సహాయం చెయ్యాలి

రాము చెప్పండి

విశ్వ గోపాలరావుగారు మీమాటకు ఎదురు చెప్పరు.

రాము అతనికి నామీద గౌరవభావం వుంది సాధారణంగా నేను చెప్పింది కాదనరు

విశ్వ: మరేమీ లేదు మీ రచయితల సమావేశం ముగియగానే వారు నా వస్త్రశాలకు వచ్చే యేర్పాటు చెయ్యాలి

రాము చెబుతాను.

విశ్వ చెప్పడం కాదు తమరు తప్పకుండా ఏర్పాటు చెయ్యాలి!

రాము మా సమావేశానికి మీరు కూడా వస్తారు కదా అప్పుడు మాటాడదాం (ఎడమవైపు నిష్క్రమిస్తాడు)

గణ ఈతలుపు పట్టుకోలేక నా ప్రాణం పోతోంది లోపల్నుంచి ఆమె ఉడుం పట్టు పట్టి లాగుతోంది

విశ్వ యిదెక్కడి ఖర్మ వచ్చి పడిందిరా!— యీమెను వెంటనే యిక్కడినుంచి పంపించకపోతే మన మర్యాద దక్కదు.

గణ ఆమె మర్యాదగా వెళ్ళిపోతుందన్న ఆశ నాకు యేకోశానా లేదు

విశ్వ యిప్పుడీ అపాయంనుంచి తప్పుకోవడం యెలాగా నాయనా?

గణ: (ఆకస్మికంగా) నాకో అద్భుతమైన ఉపాయం తోచిందండి

విశ్వ యేమిటో వేగం చెప్పితగలడు! గోపాలరావుగారు వచ్చే సమయానికి యీమెను పైకి పంపించాలి.

గణ: ఎక్కడికీ పంపనక్కర్లేదు.

విశ్వ: ఎక్కడైనా దాచేద్దామంటావా?

నిరాదరించుట శాస్త్రమునకు నష్టమనియు, పాశ్చాత్య పద్ధతి గ్రంథములనుండి సాయన గ్రహస్థానముల యొక్కయు సాయన లగ్నాది భావముల యొక్కయు, స్థితిని గుర్తించుట సులభతరమనియు, ఏకకాలిక ప్రయోగముగా సర్వజాతకములకును, వింశోత్తరీ దశనుకట్టి ఫలములు చెప్పుట శాస్త్రసమ్మతము కాదనియు, యవనులనుండి నేర్చుకొని, మన ప్రాచీన పండితులు అభివృద్ధిపరచియున్న తాజిక సంప్రదాయమందలి దృష్టి యోగములు, వర్షజాతకాదులు ఉపయోగించుట ఎంతో ప్రయోజనకారి యనియు, విపులముగా అతడుపన్యసించినాడు.

"దైవపురుషకారముల పరస్పరసంబంధ మెట్టిది? దైవము అనగా గ్రహగతి, దృష్టమైనట్టిది, పురుషకారమేమి చేయగలదు" అని అడిగితిని

"ఇది చాల చిక్కుసమస్య. స్థూలముగా నిట్లు నిర్వచించవచ్చును. మంచిదైనా, చెడ్డదైనా దానిని నమ్ముటకుగాని, వలదనుటకుగాని, మన కధికారము లేదు. వ్యక్తుల పురాకృత కర్మఫలమునకే దైవశక్తి అనిపేరు. అది ఈ జన్మమున ఏ కాలములో, ఏ స్వభావముతో, వ్యక్తము కాగలదో, జాతకశాస్త్రము దశాదులద్వారా, మనకు సూచించగలదు. ఈ దైవశక్తి ప్రసారమును నిషేధించుటకు కాని, నిరోధించుటకు కాని పురుషకారమునకు సాధ్యము కాదు. అయినా, ఆ శక్తి విరోధముగా పురుషకారము తోడుపడనిచో, ఫలము లేదనుట ముఖ్యసూత్రము. తన స్వభావముతో సరిపడు భావములు మనలో ఆశక్తి రగుల్కొలిపి ఉద్రేకింపజేయును సాధారణముగా, ఆ భావములు మన హృదయములను ఏవైపునకు లాగునో, ఆ మార్గమునందే, తెలిసియో, తెలియకయో, మనము పురుషకారము చేయుచుందుము. అట్లని, ఆ భావములకు దాసులుగా ప్రవర్తించి తీరవలెనని నియమము లేదు. తగిన సంస్కారముచేత, వివేకముచేత ఇంద్రియముల నిగ్రహించి స్వాధీనములో నుంచుకొని, ఆ దైవశక్తి ప్రసారమునకు మార్గాంతరమును కల్పించవచ్చును. పురుషకారమున క్రమక్రమముగా దైవశక్తి ఫలము యొక్క స్వభావము భిన్నస్వరూపములతో గోచరించగలదు. అనగా, దైవశక్తి యొక్క స్వభావము మార్పులేదు కాని, దాని స్వరూపమును పురుషకారము మార్పగలదనుట. దైవపరిపాకఫలము అనుభవించక తీరదు తగినరీతి ప్రవర్తించి దాని స్వరూపమును మార్పవచ్చును.

"అవశ్య మనుభోక్తవ్యం,
కృతం కర్మ శుభాశుభం"

అను సిద్ధాంతమునకు, ఈ ఉపపత్తిచే ఏమియు బాధలేదు. శంకర భగవత్పాదాచార్యులు సన్యసించి మొసలిపట్టునుండి విముక్తినొందుట, కృష్ణదేవరాయలు రాజ్యత్యాగము చేసి ప్రబల కుహూయోగదుష్ఫలము తప్పించుకొనుట, మున్నగునవి ఈ సందర్భమున వెలలేని దృష్టాంతములు.

"సామాన్యజీవితము నుండి యొక చిన్న ఉదాహరణము చూచుచు నుందు. వేసవిలో, వాయుసంచారములేని దినములలో, దుర్భరమగు తాపములో కంటికి నిద్ర అంటక బాధపడుచుందుము కదా? ఈ అవస్థల పరిస్థితి తగ్గించుకొనుటకై విద్యుచ్ఛక్తితో తిరుగు పంకా నొకదానిని రెండో మూడో రూపాయలకు కొనితెచ్చి ఉపయోగించుకొంటిమేని, ఆ బాధ కొంత తగ్గించుకొనగలము. ఈ ఉదాహరణములో మనము చేసిన కార్యమునకు అర్థమేమి? ఒకరకపు బాధ తగ్గించుకొనుటకై, మరియొకరకపు బాధను ఓర్చుకొన్నామనుట! ఆ రెండు మూడు రూకలు సంపాదించుటకొరకు అనుభవించవలసిన కాయక పరిశ్రమలని క్లేశమును అంగీకరించి వేసవి బాధను తగ్గించుకొనుటే కదా ఇది? విమర్శించి చూచితిమేని, దుష్టదశాకాలపు ఫలమును తగ్గించుకొనుటకై శాస్త్రము విధించిన జపతపములు, దానధర్మములు, పూజాప్రయోగములు, మున్నగునవి, అన్నియు, ఇట్టి తత్త్వముపైన ఆధారపడినవే. ఇట్టి యుక్తితో, సందర్భానుసారముగా, దైవఫలస్వరూపమును మార్చి కొంతలో కొంత హితకరముగా అనుభవించుటకు వీలున్నది. కాని, దీనికి గొప్ప సంకల్పశక్తి, మహత్తరసంస్కారము, కావలసియున్నది."

అని ఉపన్యసించి అతడు మౌనమూనెను. అతని సమన్వయశక్తి చాలా రమ్యముగా నుండెను. సంతోషించితిమి.

"ఈ విషయమున తమ అనుభవము ఎట్టిదో, వినుటకు కుతూహలము కలదు" అంటిని.

# ఊహా కలాపం

శ్రీ యస్వీ జోగారావు

అదియొక సుఖస్వప్న సుముహూర్తము !
ముహుర్ముహు రీహాదోహల
మధురోహా మహావర్తము !
అదివివిక్త మహోరాత్ర మిహజీవిత
మహా యాత్ర కవిముక్తము !

* * *

అదిఅపూర్వశరత్పూర్ణిమా శర్వరీ సర్వ
సౌందర్య సర్వస్వధూర్వహానర్వంనహా!
అదివిశ్రాంత తమిస్ర విధూదయ మృదూస్ర
వికస్వరవలాహకశకలైక ప్రకాశమాకాశము!
అదిఆకాశ విపులా తలాంచల విశాల
వివిధాశావకాశ పేశల
రాకాసుధాకరాలోకవ్యాకుల
వలిలాఘు దీర్ఘసమానము సముద్రము !
ఆ సముద్ర తీరమ్మున
అదిగో యొక శివాలయము
అతి శిథిలము ! శివాలయము !
శిథిలాలయ సవిధమ్మున
చిత్తభవుని చితి రగిలిన
స్థాణ్వాశ్రమ స్మశానమ్మ
నా నదిగో యొక సమాధి !

* * *

ఆ చోట నావేళ అంభోధి అలలపై
గయ్యాళిగాలి వాహ్యాళికేళి-
ఆచోట నావేళ ఆకాశ వీధిలో
జాబిల్లి మొగిలు దోబూచులాట

* * *

ఆ సమాధి వేదికపై
ఆసీనుండై కవి యొక
డున్నా డున్మత్తుని వలె
మిన్నువంక కన్నిగిడ్చి-
కలనైనా కనిపించని
తన ప్రేయసి సాకీ ఆ
కాశం బన్నట్లు కటా
ఉన్నా డున్మత్తుని వలె
మిన్నువంక కన్నిగిడ్చి-
వెన్నెల కను సన్నలలో
వెలిమబ్బుల వెనుక నొదిగి
ఊహాల కందీ యందని
మోహనాంగి హొయలు దలచి
కావ్యాలాప కలాపము
కడుకొని చేయుచు పాపము
ఉన్నా డున్మత్తుని వలె
మిన్నువంక కన్నిగిడ్చి!
అపు డకస్మికముగ వల
చంద్రకిరణ మొకటి జారి
సంద్రములో పడి యక్కడ
నొక యల చెలరేగి విరు
ర్వించి విసరె నొక గాడుపు !

ఐశ్వర్యము!
కదలి బయల్వెడలినదో
చదలనుండి జారినదో
కాని యొకానొక లతాంగి
మేనంతా మేలిముసుగు
మేఘములో చంద్రరేఖ!
అదిగో తన కభిముఖముగ-
అడుగులు తడబడ
వడివడిగా నవ్వాడి లేకుండగ
నడచుచున్న దొంటరిగా!
అలో నొక అఖిలాకారు
డతి క్రూరుడు
ముష్కర తస్కరు డతిదుష్కర
కార్యదీక్షా ధుర్యుడు
కాంతడాసి కత్తిదూసి
నగలక్కడ పెట్టి మరీ
కదలు మనుచు బెదరించెను
ఆ ధృష్టా ధరోష్ఠ
చటుల స్ఫోట నోద్భూతోద్ధుర
వాతవిధూత మై
మే ఛాసెను మేలిముసుగు!
అహో సహజ మహోరాశి!
లోకోత్తర రూపోజ్జ్వల!
తన ఊహా దాత్యూహా
వ్యూహములో
విరిసిన విద్యుల్లత!
తన ఆశాకాశములో
వికసించిన రాకాశశి!
అచ్చముగా తన ప్రేయసి!
గతచంద్రగ్రహణవేళ-
అతికామార్తాతురులై
అభిసారము, కాదుకాదు
వ్యభిచారము లాభ మనెడు
బంధుజనుల బాధకోసి
సంద్రములో సాగోరిన
చంద్రవదన! జలదవేణి!

* * *

ఆ క్షణమ్మున అంగ మెల్లను
అక్షులుగ వీక్షించి యామెను
సొమ్ములుంచిన చొప్పు లేదని
తట్టలేదో తట్టినా యొక
ఆశ మొట్లను నాశమైనది
పొరుగు నేలను పొందరా దని
అనపడుచున్నాడు చోరుడు.
'అన్న కన్నగ! ఆభరణములు
సున్న నీవిక తప్పుకొ'మ్మని
ఆమె యన్నది.
'ఏమి వగసిది! యేమి మన్నన!
ఏకతమ ఎలనాగ లెవ్వరు
వడికిరేయి పరాయి పురుషుని
పలుకరించెడి పాడిగా' దని
వాడు గండర గండమిండడు!
'ఛావ పోనీ ఛాకుగా కీ
రాండిలోపల రొక్కమున్నద?'
అన్నదామె మహాద్భుతమ్ముగ
అపు డకస్మికముగ నల
చంద్రకిరణ మొకటి జారి
సంద్రములో పడి యక్కడ
నొక యల చెలరేగి విగు
ర్వించి వినర నొక గాడుపు!

శిథిలాలయ గర్భములో
శివు డొనర్చు సత్కారము!
సమాధిచాటున కంకల
సర్పాన దాగె నృకపాలము!
కలవరపడి కల మేల్కొన
సవధరించె కవీశ్వరుడు.
ఏవీ యా నిశాచరులు
వామకర్మ పశుంపదులు?
అదుగో ఘోర విషాణము,
సమాధి స విధమ్మున నొక
పటుకర్కశ పాషాణము!

అదిగో మరి అభిసారిక,
శిథిలాలయ శిల్పములో
శివుని వెనుక చిత్ర మనెడు
చిత్రభవుని పరిచారిక!
అవేమిటా ఊళలు?
కడతేరిన కవిస్వామి
కడతేరని ముడి యూహాలు.
అదేమిటా సమాధిపై
చిత్రముగ శిలాక్షరములు?
"భావకవి కట్టిన ఊహాకలాపములో
భామవేష మెప్పటికీ తెరవెళ్లదు"

ఇప్పుడు చీర కొనుక్కోమని ఇస్తున్నాను. ఇంతకంటే సాయపడదామని మన అదృష్టం మాత్రం యెంత చెప్పండి!" అంది రాజ్యం భర్త ముఖంలోకి చూస్తూ

"నిజమే రాజ్యం!" అన్నాడు సత్యనారాయణ ఏదో ఆలోచిస్తూ కొంతసేపు ఊరుకొని మళ్లీ అన్నాడు

"ఆపిల్ల ఇక్కడుండేకంటే వాళ్ళమ్మగారింటికి వెళిపోయి కొంతకాలం అక్కడుంటే మంచిదని పిస్తున్నది!

అక్కడికి వెళితేమాత్రం యేం సుఖపడిపోవాలి ఆ ఒదినగారు నానా కాల్పులు కాల్చి చంపుతుంది!"

"అప్పులవాళ్లు ఇంటి గోడలకుండా తిరుగుతున్నారట వాళ్ళందరిని తప్పించుకుంటూ ఏకు కనబడకుండా తిరుగుతున్నాడట వాళ్లంతా ఏదక్కడ కనబడితే తంతాం అంటున్నారట"

"అయ్యబాబో! వాళ్లతో మీరైనా చెప్పాలి కారండీ!" అని అడిగింది రాజ్యం

"చెబితే మాత్రం ఎంతకాలం ఊరుకుంటారు రాజ్యం మాటాలు, సంవత్సరం అయినా దమ్మిడీ కూడా తీర్చకుండా వుంటే!" అన్నాడు సత్యనారాయణ.

"వెధవలు అన్నంత పని చేస్తారేమిటో!" అంది రాజ్యం భయంగా

"అయినా మనం ఏం చేయగలం రాజ్యం?— అప్పటికీ నేను చెబుతూనే వున్నాను వాళ్లతో!" అన్నాడు సత్యనారాయణ విచారంగా

"ఔను" అంది రాజ్యం భారంగా.

వారంరోజులు గడిచాయి. శకుంతల ఆ వారం రోజులనుంచీ రాలేదు

ఆ వేళ సాయంత్రం ఆఫీసునుంచి ఇంటికొస్తూనే, "శకుంతలొచ్చిందా?" అని అడిగాడు సత్యనారాయణ భార్యని.

"ఆ వేళనుంచి మరి రాలేదండీ!" అన్నది రాజ్యం.

"రాకపోతే మనమైనా వెళ్లి కనుక్కోవద్దూ ఏమిబ్బందులు పడుతున్నారో యేమిటో మరి!" అన్నాడు సత్యనారాయణ.

"వారంరోజుల క్రితం వెళ్లాము కదటండీ!" అంది రాజ్యం

"అప్పుడు వెళితే సరే!— వాళ్ల పరిస్థితులు బాగులేనప్పుడు ఎలా వుంటున్నారో కనుక్కుంటూ వుండొద్దూ మనంవుండి?" అన్నాడు సత్యనారాయణ.

"ఇంకా మరెలాగ కనుక్కోవడమండీ?" అన్నది రాజ్యం

"అదికాదు రాజ్యం, వాళ్ల పరిస్థితి మరీ ప్రమాదకరంగా వుంది ఇవాళ పొద్దున్న ఎవడో అప్పుల వాడు ఇంట్లో కూడా చొరబడి మారిమ్ముడిని తన్నబోతే శకుంతల గోలపెట్టగా ఇరుగుపొరుగులవాళ్లొచ్చి దెబ్బలాడి బయటికి పంపించేశారట వాడిని

"ఇది మీకెవరు చెప్పారు?"

"మా ఆఫీసులో పనిచేస్తున్న గుమాస్తా ఒకడు ఆవీధిలోనే వుంటున్నాడు వాడు చెప్పాడు నేను వెళ్లి కనుక్కుందామంటే ఈ ఆఫీసుపనివల్ల అవకాశం లేకుండా వుంది అదీ కాకుండా ఆపిల్లకి నా దగ్గర ఊరంత మొహమాటం!"

"బాగుంది!" అన్నది రాజ్యం

"ఒకసారి వెళ్ళి కనుక్కొని వచ్చేవాం రాకూడదూ?" అని అడిగాడు సత్యనారాయణ

"ఇప్పుడా?" అంది రాజ్యం బద్ధకంగా

ఏం?—రిక్షాలోవెళ్ళి మళ్ళీ అరగంటలో వచ్చేద్దాం!" అన్నాడు సత్యనారాయణ రాజ్యం నిముషం ఆలోచించి, "అయితే అలాగే!" అంది

"ఉండు నేను రెండు నిముషాల్లో మొహం కడుక్కొచ్చేస్తాను!" అంటూ సత్యనారాయణ ప్రెస్సు విప్పి లుంగీకట్టుకొని తువ్వాలు, సబ్బుపెట్టె పట్టుకొని బాత్ రూంలోకి వెళ్లాడు

ఇంతలో వీధి తలుపు దభీమని తోసుకొని ఒక పదిహేనేళ్ళ కుర్రవాడు గాభరాపడుతూ లోపలికొచ్చి, "ఏమండీ, శకుంతల ఒంటిమీద కిరసనాయిల్ పోసుకొని నిప్పంటించుకుంది చాలా ప్రమాదంగా వుంది. మిమ్మల్ని తొందరగా రమ్మంటున్నారండీ!" అని చెప్పాడు. ఈ మాట వినగానే రాజ్యం "ఆఁ!" అంటూ అలాగే కూప్పడి నిల్చుండిపోయింది ప్రక్కనున్న బాత్ రూంలోవున్న సత్యనారాయణ ఈ మాట వినగానే సగం సగం మొహం కడుక్కుంటూన్న

# చిన్న సంసారం

నాడూ గదిలోని బయటకువచ్చి "ఏమిటే?" అని అడిగాడు

"శకుంతల ఒంటికి నిప్పంటించుకుందటండీ!" అంది రాజ్యం.

"అవునండీ, ఇప్పుడే అరగంట క్రిందట, మంటలార్పి పనుల్కి తెచ్చారు. చాల ప్రమాదంగా వుంది. మా నాన్నగారు ఇంజక్షనిస్తున్నారు." అన్నాడు వచ్చిన కుర్రాడు.

"మీ నాన్నగారెవరు"?

"డాక్టరు కామేశ్వర్రావుగారండీ!"

వెంటనే సత్యనారాయణ లాల్చీ వేసుకొని వీధిలో పోతున్న రిక్షాని పిలిచాడు అతను, భార్య వెంటనే రిక్షాలో బయల్దేరారు.

అయిదు నిముషాలలో రిక్షావెళ్లి ఆ యింటి ముందు ఆగింది సత్యనారాయణ, రాజ్యం రిక్షా దిగి లోనికి వెళ్లారు. కాని అప్పటికే శకుంతల చనిపోయింది. ఆమె మృతదేహం మంచంమీద పడివుంది వారిద్దరు వెళ్ళేసరికి ఇంట్లో ఇరుగుపొరుగులవాళ్లంతమంది జనం చుట్టివేసివున్నారు శకుంతల దేహాన్ని చూసి సత్యనారాయణ దుఃఖంతో అలాగే కూర్చుండిపోయాడు ఆమె దేహం చాలాచోట్ల కాలిపోయి ఎర్రగా కన్పిస్తూన్న మాంసంతో భయంకరంగా వుంది ముఖం పూర్తిగా కాలిపోయి వికృతంగా వుంది రాజ్యం చూడగానే కెవ్వుమని అరచి భయంతో కళ్ళుమూసుకుంది

శకుంతల మృతదేహంవున్న మంచం ప్రక్కనే చిన్న అల్మైరా వుంది ఆ అల్మైరాలో చిన్నహరికేన్ లాంతరు వుంది. ఆ లాంతరులోని కిరసనాయిలే ఒంటిమీద పోసుకుంది శకుంతల. ఆ లాంతరు క్రింద ఒక ఉత్తరం కన్పించింది సత్యనారాయణకి అతను ఉత్తరం తీసి చూశాడు అది తన తమ్ముడు భార్యకి వ్రాసిన ఉత్తరం అందులో ఇలాగ వ్రాసి వుంది

శకుంతలా!

నువ్వు ఈ ఉత్తరం చూసేసరికి నేనిల్లు వదలి చాలా దూరం పోయివుంటాను నేనిలాగ నిన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతున్నందుకు నామీద నీకు చాలా కోపం రావచ్చు అసలు నాకుకూడా నిన్నొదిలి వెళ్లడం ఇష్టంలేదు కాని ఏంచేసేది? పరిస్థితులిలాగ వచ్చాయి నాకొచ్చిన జీతం మనిద్దరికి పదిహేను రోజులకి మాత్రమే సరిపోతోంది తక్కిన పదిహేనురోజులు నువ్వు ఎవ్వరింటికైనా అడిగితెచ్చిన నాడు తినడం లేని నాడు ఉపవాసాలుండడం జరుగుతోంది ఊళ్లో ఎవ్వరూ అప్పుకాని, అరువుకాని ఇవ్వకుండా వున్నారు నాకు ఈ పరిస్థితులలో మనం ఎంతకాలం సంసారం సాగించగలం?—ఏమిటో శకుంతలా!—రానురాను బ్రతుకంటేనే రోత పుట్టుతోంది మా అన్నయ్యలాగ చిన్నప్పుడు చదువుకొనివుంటే ఇప్పుడిన్ని బాధలు లేకపోయేవికదూ!—కాని అప్పుడేమిటో చిన్నతనంవల్ల ఇవన్నీ తెలియక చదువుకోకుండా తిరిగాను. మా అన్నయ్య నాన్న అయినా అప్పుడు శ్రద్ధ వహించి గట్టిగా చెప్పారు కాదు కాని ఇప్పుడవన్నీ తల్చుకొని విచారిస్తే యేం లాభం? అయితే ఇప్పుడు రెండు సమస్యలు నన్ను బాధిస్తున్నాయ్ మొదటిది సంసారం ఇంక ఎలాగ నడుస్తుందా అన్నది, రెండవది అప్పులవాళ్లబాధ ఇప్పుడు మొదటిదానికంటే రెండవ బాధే అధికంగావుంది ఎక్కడికి వెళ్ళినా ఈ అప్పుల వాళ్లు నా ప్రాణాలు తీస్తున్నారు చివరికి ఇంట్లో కూడా చొరబడి చేయిచేసుకోడానికి తయారవుతున్నారు ఇందువల్ల కొంతకాలం ఎక్కడైనా తిరిగితే ఈ బాధలు తప్పకాయన్న ఉద్దేశంతోను, ఇంతకంటే మంచి ఉద్యోగం దొరుకుతుందేమో అన్న ఆశతోను ఇల్లువిడిచి పోతున్నాను ఎటు పోతున్నానో మాత్రం ఇప్పుడు చెప్పలేను అసలు ఎటుపోవాలనో నాకే తెలియటంలేదు నాగురించి నువ్వు ఏమీ విచారించకు నేనుండిమాత్రం నిన్నేం సుఖపెట్టాను?—ఇంకా నలభై రూపాయల జీతం తెచ్చుకుంటూ ఇక మీదట మాత్రం యేం సుఖపెట్టగలను?—అంచేత నువ్వు మరి విచారించకుండా మా అన్నయ్య దగ్గరకు వెళ్ళిపో!—మనరోజులు బాగుండి ఏనాటికైనా ఈ దారిద్ర్యం వదిలితే తిరిగి కలుసుకుందాం!—

శేషగిరి.

# నక్షత్రాలు: గ్రహాలు

శ్రీ కార్ల మణిభూషణరావు

అనాది యుగములనుండి అనంతమైన నీలాకాశమున అసంఖ్యాకమై మిణుకు మిణుకు మెరయు నక్షత్రమండలములను చూచుటవలన వీటియందు ప్రాణి జీవించుటకు ఎచ్చటనైనను ఆధారములు కలవా? లేవా? యను సమస్య వచ్చి అపరిష్కృతమైయుండెను ఈ విశాలవ్యాప్తిలో ఇట్టి అసంఖ్యాకమైన నక్షత్రములు దేనినుండి ఉద్భవించినవో యను తలంపు రాక మానదు.

యుగయుగములనుండి ఈ సమస్య అపరిష్కృతమైయుండెను. నేటి ఖగోళశాస్త్రము అత్యున్నత స్థితికి వచ్చిన తరువాత అనేక శాస్త్రజ్ఞులు ఈ విషయమై పలువిధముల చర్చలు జరిపిరి మహాశాస్త్రవేత్త, మేధావి, యగు సర్ హెరాల్డ్ స్పెన్సర్ జోన్సు తన అమూల్యకాలమునందు ఈ విషయముపూర్తి కొన్ని ముఖ్యోద్దేశములను తెల్పుచు అనేక గ్రంథములను రచించెను తన ముఖ్య పరిశీలనలబట్టి ఎల్లప్పుడు ఒకే పరిమాణము గొప్ప తేజస్సు, భయంకరమైన అగ్ని, వాయువులు మొదలగు వానితో నిండిన ఈ సూర్యమండలము చుట్టూ పది దిక్కులగా తిరుగుచున్న నవగ్రహములలో భూమియు నొక గ్రహమై యున్నదని తెలిపెను.

భూమిపై నివసించెడి ప్రాణికోటివలె ఇతర గ్రహములందుకూడ ప్రాణులుండుటకు కొన్ని అవకాశములు కలవని చెప్పుచున్నారు సూర్యునకు మిక్కిలి దగ్గరగను దూరముగను సంచారము చేయు గ్రహములందు ప్రాణులు జీవించుటకు ఆధారములు లేవు కొన్ని జీవులు మాత్రము హెచ్చు ఉష్ణముకంటె అనగా మరుగుచున్న నీటియావిరియందును, మంచు కన్న -10°C ఉష్ణము వద్దను జీవించగలవు ఆయా ప్రదేశములందుండెడి వాతావరణమునందు ప్రాణి జీవించుటకు అనుకూలమగు వాయువులు అనగా ప్రాణవాయువు నత్రజని నీటియావిరి మున్నగునవి ఉండిన అచ్చటకూడా ప్రాణులు జీవించగలవు

సూర్యుని చుట్టూ తిరుగుచున్న నవగ్రహములలో బుధుడు మిగిలిన గ్రహములకన్న దగరగా నున్నాడు బుధుని ననుసరించియే శుక్రుడు అను గ్రహము తిరుగుచున్నది భూమి తరువాత పై గ్రహములను ప్రత్యేక కృతములలో అంగారకుడు బృహస్పతి, శని వరుణుడు, ఇంద్రుడు, యముడు అను గ్రహములు వరుసగా సూర్యుని చుట్టూ తిరుగుచున్నవి

గ్రహములు నక్షత్రములు కావు. వీటికి నక్షత్రములకు వలె ప్రత్యేకమగు తేజస్సు లేదు గాని సూర్యుని కిరణములచే తేజోవంతముగా మన దృష్టికి గోచరించును నక్షత్రములకు, సూర్యునకు మధ్యనుండెడి దూరముతో ఈ నవగ్రహముల దూరము పరిపోల్చిన ఈ గ్రహములు సూర్యునకు చాలా సమీపముననున్నవని చెప్పుటలో సందేహము లేదు ఈ గ్రహములలో మిక్కిలి దగ్గరగానున్న బుధుడు సూర్యునకు మూడు కోట్ల అరవది లక్షల మైళ్ళ దూరములో గలడు నవగ్రహములలో చివరనుండెడి గ్రహములు ఇంద్రుడు, యముడు సూర్యునకు సుమారు 400 కోట్ల మైళ్ళ దూరములో గలవని చెప్పుదురు నవగ్రహము లన్నింటి పరిమాణము, సూర్యుని పరిమాణముతో పరిపోల్చిన సూర్యునిలో 1/170 వ వంతు కూడ లేవు. నవగ్రహములలో సూర్యమండలమునకు దగ్గరగా నున్న గ్రహములు అనగా బుధుడు, శుక్రుడు, భూమి, అంగారకుడు అను వాటికి ఇహలోకగ్రహము లందురు

బుధుడు సూర్యుని చుట్టు నొకసారి తిరుగుటకు సుమారు 88 దినములు పట్టును అందుచేత అచ్చట సంవత్సరమునకు 88 దినములని చెప్పవచ్చును బుధుడు భూమికన్న అనేక రెట్లు సూర్యునకుదగ్గరగా నుండుటచే సూర్యునకు భూమ్యాకర్షణశక్తికన్న బుధుని యందెడి ఆకర్షణశక్తి ఎక్కువ ఈ గ్రహము తనలో తాను తిరుగుచు సూర్యునిచుట్టూ భూమివలె ఒకేరీత

చుట అసంభవము. నవగ్రహము లన్నిటిలోని కవి గ్రహము తెలిసినదని చెప్పుదురు.

మిగిలిన గ్రహములు వరుణుడు (Uranus), ఇంద్రుడు (Neptune), యముడు (Pluto) భూమికి అనేక కోట్ల మైళ్ళ దూరంలో గలవు. అందుచే ఇవియు నక్షత్రములవలె మన దృష్టికి గోచరించును, కాని కాంతిహీనములు. ఇచ్చట ఉష్ణము సుమారు —225°C తక్కువగా నుండును. వరుణుడు సూర్యునిచుట్టు నొకసారి తిరుగుటకు 165 సంవత్సరములు పట్టును. అమెరికా దేశపు శాస్త్రజ్ఞుడు యముని 1930 సంవత్సరమున కనిపెటెను. భూమి కెవ్విధముగ నొక చంద్రమండలముగలదో వరుణుని చుట్టు నైదు ఉపగ్రహములు గలవు. అందులో నొకదానిని 1947 వ సంవత్సరమున కనిపెట్టిరి. ఇంద్రునకు గూడ నొక ఉపగ్రహము గలదు

సూర్యుడు, సూర్యునిచుట్టు తిరుగుచున్న గ్రహములు దేదీప్యమానమైన తేజస్సుతో తిరుగుచున్న నక్షత్రములనుండియే ఉద్భవించినవని చెప్పవచ్చును. సూర్యుడును పూర్వ మొక నక్షత్రమే. ఈ నక్షత్రములు గూడ కాంతిహీనమైన సూర్యమండలములని చెప్పవచ్చును. నక్షత్రములు మనకు అపరిమితమైన అసంఖ్యాకమైన దూరములో గలవు. సూర్యమండలము యొక్క వ్యాసము సుమారు 40 కోటమైళ్ళు గలదని చెప్పుదురు. సూర్యమండలమును మన భూమితో సరిపోల్చిన దాని ఆకారమునకు సుమారు 10 లక్షల భూమండలములు చాలవు. కాని సూర్యమండలముకన్న అనేక రెట్లు విస్తీర్ణముగల నక్షత్రములుకూడ గలవు. ఓరియాన్ (Orion) అను నక్షత్రవ్యాసము సూర్యుని వ్యాసముకన్న 800 రెట్లు పెద్దదిగానున్నదని చెప్పుదురు. అనగా 80 లక్షల సూర్యమండలముల ఆకారము గలదని చెప్పవచ్చును. హ్యూజ్ (Huge) అను నక్షత్రము 60 లక్షల కోట్లమైళ్ళ వ్యాసము గలదని చెప్పుదురు

నక్షత్రములు మనకు అపరిమితమైనట్టియు, అసంఖ్యాకమైనట్టియు దూరములో గలవని తెలిసియున్నాము. ఇట్టి సంఖ్యను మైళ్లలో ఊహించుట కష్టము. నక్షత్రములకును మనకును గల దూరమును కాంతి సంవత్సరము (Light year) అను పరిమాణముతో గుర్తింతురు. వెలుతురు (Light) ఒక లిప్త (Second)కు 186,000 మైళ్ళ దూరము ప్రయాణము చేయగలదు. దీనిని క్రమముగా గుణించిన గంటకు దినమునకు సంవత్సరమునకు ప్రయాణముచేయు దూరము వచ్చును. ఇట్టి సంవత్సరకాలము వెలుతురు ప్రయాణముచేయు దూరమునకే కాంతిసంవత్సర మందురు. ప్రోక్సిమా (Proxima) అను నక్షత్రము మనకు 4 3 కాంతి సంవత్సరముల దూరములో గలదని చెప్పుదురు. పై రెండింటి మధ్యనుండు దూరముగూర్చి ఊహించినఎడల సుమారు 25 000 000,000,000 మైళ్ళు గలవు. భూమికి 10 కాంతిసంవత్సరముల దూరములో నున్న నక్షత్రములు చాలా తక్కువ; లెక్కపెట్టవచ్చును. ఉత్తర దిశయందు మినుకుమినుకుమని మెరయు ధ్రువ నక్షత్రము (Pole Star) భూమికి 44 కాంతి సంవత్సరముల దూరములో గలదు. అనగా అద్యటినుండి వెలుతురు మనకండ్లవద్దకు వచ్చుటకు 44 సంవత్సరముల క్రిందటే బయలుదేరి యుండవలెనని చెప్పవచ్చును. ఇదిగాక దూర దూరాంతములలో గల నక్షత్రములు, శక్తివంతమైన దూరదర్శనీయంత్రసహాయముతో చూచిన కనిపించును. ఈ నక్షత్రగతిలోని కొన్నింటి కాంతి భూమిమీద పడుటకు అనేక కోట్ల సంవత్సరములు పట్టును. విశ్వముగూర్చి ఈ ఊహ విభ్రాంతిని గలుగజేయును. ఈ మహావిశ్వంలో ఈ భూగోళమెంత? ఈ భూమిపై జీవించే మానవుడెంత? కాని మానవుని ఉనికి స్వల్పమైనదైనా, మానసికంగా గొప్పది.

నేటి అణుయుగమందు, అంగారకగ్రహాన్ని, చంద్రుని చేరుటకు, విశ్వాంతరయానము సాగించుటకు విశ్వప్రయత్నములు చేయుచున్నటు మనము పత్రికల ద్వారా వినుచున్నాము. ఉన్నట్లుండి రష్యనులు గత అక్టోబరు 5 వ తేదిని ఒక కృత్రిమ గ్రహము (Satellite)ను తయారుచేసి విశ్వాంతరంలోనికి విసరివేసిరి. ఈ కృత్రిమగ్రహం మరియొక చంద్రమండలమువలె భూమిచుట్టూ తిరుగుట విఖిలప్రపంచాన్ని ఆశ్చర్యములను చేసినది. విశ్వవిజ్ఞానానికి ఇది మానవుడు విజయవంతంగా చేసిన తొలిదండయాత్ర. ఇదిగాక రష్యను విశ్వాంతరణ పరిశోధకులు గత నవంబరు 3 వ తేది ఉదయం 11-45 నిముషములకు మరియొక కృత్రిమ గ్రహమును తయారుచేసి అందులో ఒక కుక్కను ఉంచి గగనమార్గంపైకి పంపివేసిరి. దీనివలన విశ్వాంతరయానమునకు గల అవకాశములనుగూర్చి ప్రపంచమంతా అత్యాశ్చర్యముతో వేచియున్నది. తరువాత అమెరికనులు గూడ మరియొక గ్రహాన్ని విజయవంతంగా వదలిపెటిరి. ఉభయులూ విశ్వాంతరంలోని గ్రహములను చేరుకొనుటకు తీవ్రమైన ప్రయత్నములు సాగిస్తున్నారు. ఇది ఎంతైన ఆశ్చర్యకరమయిన విషయం.

మానవుడు ఒకానొకప్పుడు ఈ గ్రహములేగాక నక్షత్రములనుగూడ జయించబోవునని చెప్పుటలో అతిశయోక్తి లేదు.

